# రచయితా శిల్పమూ

ఇల్యా ఎహ్రెన్‌బర్గ్



# రచయితా - శిల్పమూ

రచన :

ఇల్యా ఎహ్రెన్ బర్గ్

అనువాదం :

తుమ్మల వెంకటరామయ్య



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

ప్రచురణ సంఖ్య : 1872 ప్రతులు : 2,000

ప్రథమ ముద్రణ : జూలై, 1955
ద్వితీయ ముద్రణ : నవంబర్, 1986
తృతీయ ముద్రణ : మే, 1989



టైటిల్ డిజైన్ : గోపి



ప్రతులకు :

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
4-1-435, విజ్ఞానభవన్, బ్యాంక్ స్ట్రీట్.
హైదరాబాదు - 500 001.

**విశాలాంధ్ర బుక్ హౌస్**
విజయవాడ, హైదరాబాదు, అనంతపురం, విశాఖపట్నం,
హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

ISBN : 81-7098-133-6

ముద్రణ :
శ్రీ రాజ రాజేశ్వరీ ప్రింటర్స్
2-2-1167/2/E/3 & 4, 'ప్రింటింగ్ కాంప్లెక్స్'
తిలక్‌నగర్, హైదరాబాదు - 500 044.

# పరిచయం

ఇల్యా ఎ్రెహెన్ బర్గ్ సోవియట్ యూనియన్ సాహితీరంగంలోనే ప్రపంచ ప్రఖ్యాతి చెందిన రచయిత. ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలంలో యుద్ధ రంగం నుండి కలాన్ని శతృగళాల్ని ఛేదించే పదునైన ఆయుధంగా ఉపయోగించాడు. భారతీయ అభ్యుదయ రచయితలకు కూడా ఈయన కొత్త కాదు. సతీసమేతంగా భారతదేశం సందర్శించిన సందర్భంగా మద్రాసులో ఆంధ్ర అభ్యుదయ రచయితలను కలుసుకొన్నారు.

మూడు దశాబ్దాలు దాటినా ఇంకా ఈ రచనకోసం పాఠకులు పదే పదే ఉత్తరాలు రాస్తున్నారంటే దీని విలువ వేరే చెప్పనక్కరలేదు. ఈ గ్రంధంలో లేవనెత్తిన అనేక సమస్యలను, లోటుపాట్లను అధిగమించి సోవియట్ రచయిత నూతన సాహిత్య సృష్టిచేస్తున్న మాట నిజమే, కాని ఈ నాటికీ మన లాంటి దేశాలలో తలెత్తుతున్న వాదవివాదాలను పరిష్కరించేందుకు సహాయపడగల ఈ గ్రంధాన్ని పునర్ముద్రించుతున్నాం. అనువాదాన్ని పునః పరిశీలించి, సవరించి ముద్రిస్తున్న ఈ గ్రంధాన్ని పాఠకులు ఆదరిస్తారని విశ్వశిస్తున్నాం.

హైదరాబాద్ — ప్రకాశకులు

# రచయితా : శిల్పమూ

## 1

లెనిన్‌గ్రాడ్ యువ ఇంజనీర్ ఒకరు ఇటీవలనే నాకొక ఉత్తరంలో ఇలా రాశారు. "మన జీవితం కన్నా మన కల్పనా సాహిత్యం ఎందుకింత బలహీనంగా, నిస్సారంగా ఉంది? ఇటీవల ఈ విషయమై చర్చించుతున్నాం; కాని ఎవరూ తగు సమాధానం ఈయలేకపోయారు. జార్ కాలం నాటి రష్యాతో నేటి సోవియట్ సమాజాన్ని పోల్చ వీలులేదు. ఐనప్పటికీ అపుడు గొప్ప గ్రంథాలు రచించబడ్డాయి. ఇప్పుడు అత్యాసక్తితో చదువదగిన గ్రంథాలు సోవియట్‌లో కొన్ని వున్నాయన్నమాట నిజమే. కాని మరికొన్ని పుస్తకాలున్నాయి. అవి ఎందుకు రచించారా అని ఆశ్చర్యపోతాం. అంతా సక్రమంగానే వున్నట్లు కన్పించుతోంది. కాని ఏదోకొంతలోటు వాటిల్లో కన్పడుతుంది. అవి నిన్ను తన్మయులను చేయవు. నీహృదయంలోకి చొచ్చుకుపోవు. ఆ రచనలలోని ప్రజలు వాస్తవికత జీవితంలోని ప్రజలుకారు."

ఇలాంటి అభిప్రాయాలను వినడం ఇది మొదటిసారికాదు. రచయిత శిల్పం (Craft) గురించి నా అభిప్రాయాలను పాఠకులకు అందీయాలని ఈ లేఖ నన్ను ప్రోత్సహించింది. ఇపుడు నేను చెప్పబోయేది వ్యక్తిగతాభిప్రాయం మాత్రమేననీ, నా వ్యక్తిగత అనుభవం ఆధారంగా వ్రాస్తున్నదనీ వేరే చెప్ప నక్కరలేదు. మా సోషలిస్టు సమాజంపై ప్రేమ, ఆ సమాజ భవిష్యత్తులో మా విశ్వాసం, సోవియట్ రచయితలైన మమ్మందరినీ ఐక్యపరచింది. కాని మేము విభిన్న విషయాలపై ఎవరి ధోరణిలో వారు వ్రాస్తాం. మాలో ఒక్కొక్కరి అనుభవం వేర్వేరుగా వుంది. రచయితలంతా నేను వెలిబుచ్చిన కొన్ని అభిప్రాయాలతో నిస్సందేహంగా ఏకీభవించుతారు. కాని చాలామంది మరికొన్ని అభిప్రాయాలతో విభేదించుతారు. మయకోవస్కీ ఒకసారి ఇలా అన్నాడు. "కవి అవడానికి నిబంధన లేమిటని అడిగితే నేనేమీ నిబంధనల్ని సూచించలేను. ఎందుకంటే నిజానికి అలాంటి నిబంధనలంటూ లేవు." నవలా రచయిత కావాలన్నా, అలాంటి నిబంధనలేమి లేవూ. ఈ విషయమై ఒక సిద్ధాంతాన్ని

ప్రతిపాదించాలని గాని, సలహా ఇవ్వాలని గాని నాకు ఉద్దేశ్యంలేదు. అలా సలహా ఇవ్వడం నమ్రతను సూచించక పోవడమేగాక బుద్ధి హీనత కూడా అవుతుంది. విభిన్న రచయితలు విభిన్న మార్గాలద్వారా సాహిత్యంలో ప్రవేశించుతారు. ప్రతి రచయితా తన స్వంత పద్ధతిలో రాస్తాడు; సృజనాత్మకమంలో కూడా ప్రతిరచయితకూ ఒక్కొక్క స్వంత మార్గం వుంటుంది. నేను నారచనా పద్ధతిని ఎలా అర్థం చేసుకుంటున్నానో అది మాత్రమే చెప్పదలచాను.

మన సాహిత్యంకన్నా మన జీవితం ఎంతో గాఢమైనదని సజీవనమైనదని పై వుత్తరం రాసిన ఇంజనీర్ చెప్పడం సరియైనదే. మనకిపుడు లియో టాల్‌స్టాయ్‌లు లేరు. సాల్టికోవ్ - షెడ్రిన్‌లు లేరు. చెకోవ్‌లు, గోర్కీలు లేరు. (దీని అర్థం మనకు చక్కని రచయితలు లేరనిగాని, మంచి నవలలు లేవనిగాని కాదు.) ఒక్కొక్క శకంలో మహా మేధావులు జన్మించడం, మరొక శకంలో జన్మించక పోవడం 'కర్మ' అని గానీ, ప్రకృతి స్వభావం అని గానీ మనం భావించరాదు. లెనిన్ గ్రాడ్ ఇంజనీర్ వేసిన ప్రశ్నకు సమాధానం ఈయాలంటే రచయిత శిల్పానికి సంబంధించిన అసలు స్వభావాన్ని గురించే చర్చించవలసి వుంటుంది.

ఎమెచ్యూర్ ఫొటోగ్రాఫర్ కామెరా మీట నొక్కుతాడు. నడుస్తున్న లేక పరుగెత్తుతున్న వ్యక్తి ప్రతిబింబం శీఘ్రగ్రాహియైన ఫిలిమ్‌లో ముద్రపడడానికి ఒక సెకండులో నూరవ వంతైనా చాలు. చిత్రకారుడు ఒక వ్యక్తి నమూనాను (Model) తయారుచేసేటప్పుడు అతని ముఖంలోకి చాలా సేపు చూస్తాడు. అతని రూపురేఖలలో అతని స్వభావం, అంతరంగిక జీవితం ప్రతిబింబించుతున్నదేమో కనిపెట్టడానికి ప్రయత్నించుతాడు. తన సృజనతో చిత్రకారుని లాగానే రచయిత కూడా, తన పాత్రలను బహు శ్రద్ధగా అధ్యయనం చేస్తాడు.

మనకంటె మన పూర్వపు మహా రచయితలకు రాయడం సులభం. కారణం — చాలా నెమ్మదిగా మారుతూన్న సమాజాన్ని వారు వర్ణించారు. సాల్టీకోవ్ - షెడ్రిన్ బానిస విధానం నిర్మూలింపబడిన కాలంలో నివసించాడు. అతని రచనలలో ఆనాటి సామాజిక పరివర్తనలు ప్రతిబింబించినాయనే మాట నిజమే. పాంపడూర్‌ల (Pompadurs) రాజ్యంలోగాని గోలోవ్ల్యావ్‌ల (Golovlyovs) కుటుంబాలలో గాని గాఢమైన ఆత్మిక మార్పులు (Spiritual changes) లేవు. చెకోవ్ మొదట్లో వ్రాసినకథలలోని స్త్రీ పురుషులు అతని తర్వాత రచనలలోకూడ తిరిగి ప్రత్యక్షమౌతారు. ఐతే రచయిత శైలి మారింది, కాని నమూనాలు మారలేదు.

మన సమాజం మన కళ్ళముందే నిర్మించబడుతూంది. ఆనాడు సత్వరం పరిష్కరించవలసిన సమస్యలపై రాసిన నవలలు ఇంకా పాతవిగాకుండా సజీవంగానే వున్నాయి. అవి వాటి సాహిత్య ప్రతిభను కోల్పోకుండా చారిత్రాత్మకమైన నవలలుగా తయారయ్యాయి. "ది నైంటీన్" (దళం) "ది వర్జిన్‌సాయిల్ అప్ టరన్డ్" (బీళ్ళుదున్నేరు) అనేవి ఇందుకు ఉదాహరణలు. ఇటీవల ప్రపంచ యుద్ధంలోకి వీరులు "చాపయెవ్", "ది ఐరన్ ఫ్లడ్"లలోని పాత్రల వంటి వారు కారు. నేటి కాలేజి విద్యార్థులు 1925లో కార్మికుల హైస్కూళ్ళల్లో చదివిన యువతీయువకుల వంటి వారుకారు. మార్చ వీలులేని వని భావించబడే భావోద్రేకాలు (Emotions) ఆశ్చర్యకరమైన వేగంతో మారుతున్నాయి. ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలం నాటి యువతీయువకుల భావాలకూ (Feelings) నేటి ప్రేమ దంపతుల భావాలకూ తేడా వుంది.

టాల్‌స్టాయ్, తుర్గినివ్, గోంచరావ్, చెకోవ్‌లకు తమ పాత్రల భావోద్రేక స్వభావం, నడవడీ అన్ని పరిస్థితులలోనూ తెలుసు. త్వరత్వరగా మారిపోతున్న సమకాలీన వ్యక్తుల ఆలోచనలను చిత్తవృత్తులను తెలిసికొనడం నేటి సోవియట్ రచయితకు చాలా కష్టం. ఇదివరకే నెలకొనివున్న సమాజ చిత్రాన్ని బట్టబయలు చేయడంగాని, లేక ఊరికే వర్ణించడంగాని ఒకఎత్తు. చరిత్రలో ఇదివర కెన్నడూ లేని ఒక సమాజాన్ని, ఇపుడు నిర్మాణావస్థలో ఉన్న ఒక సమాజాన్ని, రచయిత కూడా ఆ నిర్మాణంలో భాగస్వామిగా వున్న సమాజాన్ని, చిత్రించడం మరో ఎత్తు. ఈ రెండింటినీ పోల్చడానికే వీలులేదు.

అప్రయత్నంగా వెన్వెంటనే "నేటి బూర్జువా సమాజంలోని రచయితల పరిస్థితి ఏమిటి?" అనే ప్రశ్నవస్తుంది. వారి కర్తవ్యం చాలా సులభంగా ఉన్నట్లు కన్పించుతుంది. మరణ శయ్యపై ఉన్నా, ఇంకా బ్రతికేవున్న ప్రపంచాన్నిచిత్రించడం వారిపని. అయినప్పటికీ ఆధునిక పాశ్చాత్య సాహిత్యంలోని భావ దారిద్ర్యంచూస్తే ఆశ్చర్యం వేస్తుంది. ఫ్రాన్స్, ఇంగ్లండ్, అమెరికాల లోని సదుద్దేశ్యంగల విమర్శకులే ఈ విషయాన్ని అంగీకరించుతున్నారు.

గత శతాబ్దంలోని మొదటి, రెండవ ప్రపంచయుద్ధ కాలాల మధ్య పేరెన్నికగన్న రచయితలు-రోమాఁరోలా, డ్రీజర్, బెర్నార్డ్ షా, హామ్సన్ (అతడు చివరకు నీచంగా చనిపోయినా అతని మొదటి నవలలోని ఉత్కృష్టతను మరచిపోలేం) వెల్స్, రోగర్‌మార్టిన్ డ్యూగార్డ్, గాల్స్‌వర్దీ, హాప్ట్‌మాన్, హీన్రిక్ మాన్, పిరాండిలోలు - అద్భుతమైనరచనలు కొనసాగించుతూనే వచ్చారు. ఇదే కాలంలో అమెరికాలో బహు చక్కని నవలలు, పశుత్వ మాన ఎత్వాలతో నిండిన నవలలు వచ్చాయి. హెమింగ్వే, కాల్డ్‌వెల్, స్టీన్‌బెక్,

ఫాక్నర్‌లు రాసిన మొదటి నవలల్లో రచయితల చిత్తశుద్ధి, గాఢమైన నిస్పృహ పాఠకుల్ని ఆకర్షించాయి. కొందరు విమర్శకులు వారిని నిరాశా వాదులు అని నిందించారు. జాతి వివక్షతా విధానం, లాభాలకై దేవులాడటం, కిరాతకత్వం, మానవ ఔన్నత్యాన్ని భంగపరచడం, వీటన్నిటికి వ్యతిరేకంగా సమాజంలోని అభ్యుదయకాముక ప్రజలు సాగించిన పోరాటాన్ని చిత్రించిన రచయితలు అమెరికాలో అప్పుడు కూడా వున్నారని వేరే చెప్పనక్కరలేదు: కాని అమెరికాలోని అభ్యుదయవాదులు అపుడు ఇంకా బలహీనంగానే వున్నారు.

లక్షలాది బాబిట్‌ల (Babbits) విస్పష్ట మందహాసానికి వ్యతిరేకంగా తమ నిస్పృహను వెల్లడిస్తూ, తాము చూచినదాన్ని, నిరాశావాదులని నిందింపబడిన యీ రచయితలు వర్ణించారు. (కళలన్నా, మేధావివర్గ సంబంధమైన వృత్తులన్నా పనికిమాలినవనీ, తన వ్యాపార విజయమే పరమాశయంగా పెట్టుకొనే మధ్యతరగతి సాంప్రదాయక వ్యాపారస్తుణ్ణి బాబిట్ అంటారు-అనువాదకుడు)

రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో, బూర్జువా యూరప్‌లోని రచయితలు మారియక్, డొబ్లిన్, జూన్స్‌రొమైన్స్, మొరావియా, జాయిస్, రాట్, మొదలైనవారు పెట్టుబడిదారీ సమాజం ఎలా వట్టిపోయిందో, వృధా అయిందో తమనవలలో వర్ణించారు. అలాంటి పుస్తకాలను నేడు పాశ్చాత్యదేశాలలో వ్రాయడంలేదు. నేను పైన ఉదహరించిన రచయితలలో కొందరు చనిపోయారు. మరికొందరు మౌనం వహించారు. ఇంకా కొందరు నైతికంగా పతనమయ్యారు.

రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో బూర్జువా ప్రపంచ రచయితలు తమ సమాజపు పతనం ఖాయమని గ్రహించారు. కాని అందుకు ప్రశాంతంగా శోకించడానికి తగిన వ్యవధిమాత్రం ఇంకా వారుంచుకొన్నారు. వారి నిస్పృహ ఒకపరిధిలోనే వుంది. అందుచే కళాత్మక రచనలలో దానిని ఇమడ్చడానికి వారికి అవకాశం వుంది. కాని తమ పాత్రలకు - ఆమాట చెప్పాలంటే తమకే - మరునాడేమి జరుగుతుందో నేటి పాశ్చాత్య రచయితలకు తెలియదు. ఒక సంవత్సరంలో నీ నెత్తిపైన ఆటంబాంబు పడుతుందని చెబుతున్నపుడు, ఓ వీధిలో అమెరికా సైనికులు, మరో వీధిలో సమ్మెదార్లు నడుస్తున్నప్పుడు, ఒక నవలను గురించి ఆలోచించడం కష్టం. కొంతమంది రచయితలు వార్తాపత్రికలలో ఉన్మత్త ప్రేలాపనలు సాగించారు. మరికొందరు మానసిక రోగ పరిశీలకులకూ, నేరచట్ట ప్రవీణులకూ అభిరుచి కల్గించే విషయాలను - ఎక్కడోగాని జరగని విషయాలను - ఇష్టం లేకపోయినా వర్ణించ మొదలు పెట్టారు.

శిథిలమౌతున్న సమాజంలోని రచయితల గతి అలా వుంది. కాని బూర్జువా దేశాలలోకూడ గొప్ప రచయిత లున్నారు. వారి పుస్తకాలు పాఠకుని ద్రవింప జేస్తాయి. పాశ్చాత్య ప్రపంచంలోని ధనికదేశాలలో గాని బీద దేశాలలో గాని కొరవడి వున్న ఆశను వారు తమ పాఠకుల మనసులలో హత్తింపజేస్తారు. ఈ కొత్త పుస్తకాలు కొత్త పాఠకులను సంపాదించాయి.

లాటిన్ అమెరికాలో సాధారణ ప్రజలు మొట్టమొదటిసారిగా నవలలు, పద్యాలు చదవడం, లాటిన్ అమెరికా రచయితల గ్రంథాలు మొట్టమొదటి సారిగా ప్రపంచాన్ని చుట్టుముట్టడం ఆశ్చర్యంగాదా ?

"రూబెన్ డారియో" కవితను తెలిసినవాళ్ళు యూరప్‌లో కొద్దిమందే వున్నారు. కాని నేడు నెరూడా, అమాడో, గిల్లెన్‌ల పుస్తకాలను అపేక్షతో చదవని యూరపియన్ సాహితీ ప్రియుడు ఎవడూలేడు. రైతులకు, గనిపని వారలకు, నావికులకు తెలిసిన రచయిత టర్కీలో ఎవరైనా ఇదివరలో వున్నారా? విదేశాలలో సైతం సుపరిచితమైన టర్కీ రచయిత ఎవరైనా ఇదివరలో వున్నారా? కాని నేడు నజీమ్ హిక్మత్ కవిత లక్షలాది ప్రజల హృదయాలలోకి చొచ్చుకుపోయింది. రేనో కార్మికులు వాలెరీ పద్యాలు చదివారా ? కాని ఇపుడు పాల్ ఎలార్డ్, లూయీ అరగాన్‌ల పద్యాలను (అవి సులభంగా గ్రహించడానికి వీలు లేనివైనా) చదువుతున్నారు. ఫ్రెంచి ప్రభుత్వ ప్రతినిధులు విదేశాలలో తమదేశ ప్రతిష్టను గురించి గొప్పగా చెప్పుకోవలసి వచ్చినపుడు ఈ ప్రముఖుల పేరును వారు ఉదహరించక తప్పడం లేదు. "అమెరికాలో గత తరం రచయితలు" అని పేరుపడ్డ రచయితల ప్రతిభ, రెండో ప్రపంచ యుద్ధకాలంనుండి వెల వెల బోయింది. కాని హోవర్డు ఫాస్టు ప్రజ్ఞ ఇనుమడించి ఎంతో బలపడింది. నేనుదహరించిన రచయితలు బూర్జువా సమాజంతో తెగతెంపులు చేసుకున్నారు. అందుకేనా వారు ఉత్తమ రచయితలుగా నాకు కన్పించుతున్నది ! కాదు. వారు నిజంగానే ఉత్తమ రచయితలు. ఇతరులకంటె ఆత్మికంగా ఉన్నతులు గనుకనే వారు భవిష్యత్తు వైపు అభిముఖులయ్యారు.

పాశ్చాత్య దేశాలలో ఒక రకం పాఠకులున్నారు. అపరాధ పరిశోధక నవలలతోను, కొంతవరకు సెంటిమెంటల్ కధలతోను, "రీడర్స్ డైజెస్టు" లాంటి అన్నిరంగాల పత్రికలు ప్రచురించే నీతిమాలిన చెత్తా చెదారంతోను వారు సంతృప్తి చెందుతారు. మరికొన్ని దేశాలలో ఈ రకం పాఠకులు ఇంకా చాలమంది వున్నారు.

కాని వారిని ఆ దేశంయొక్క భవిష్యత్తు అనిగాని, అంతరాత్మ అని గాని, గుండెకాయ అనిగాని అనలేం. పనిచేసే పాఠకులు, సృజనచేసే పాఠకులు, ఆలోచించే పాఠకులు మంచి పుస్తకాల్నే కోరుతారు.

ఫ్రాన్సులో, స్కాండినేవియన్ దేశాలలో, లాటిన్ అమెరికా సోవియట్ నవలల అనువాదాలు విజయవంతమయ్యాయి. అవి ఎలా రాశారు అనేదాని కన్న, అవి వేటిని వర్ణించుతున్నాయనే దానిని బట్టే ఈ విజయం ఆధారపడి వుంది.

ఇటీవలనే ఒక ఫ్రెంచి యువ రచయిత - యువకుడే అయినా అపుడే అతడు సుపరిచితుడుకూడా - రాసిన ఒక నవలను చదివాను. ఆ నవలలోని కథానాయకుడు యువకుడు: హోమో సెక్సుయలిస్టు. ఆస్తికోసమని ఒక ముసలావిడను అతడు పెళ్ళి చేసుకొంటాడు. పెళ్ళిచేసుకొన్న తర్వాత ఆ రాత్రిని రచయిత వివరంగా వర్ణించుతాడు. తన సోదరిని చూడటానికి కథానాయకుడు వెళతాడు; వెళ్ళి ఆమెతో రమిస్తాడు. అలాంటి పుస్తకాలతో విసుగెత్తిన ఫ్రెంచి పాఠకుడు "ది యంగ్‌గార్డు", "హార్వెస్ట్" లాంటి సోవియట్ నవలల్లో పరిశుభ్రమైన వాతావరణాన్ని చవిచూస్తాడు.

పాశ్చాత్య దేశాల సంధ్యాకాలం ముగిసింది. అస్పష్టమైన నీడలు దానిని ఆవరించి భయాన్నీ, మనఃక్లేశాన్నీ కల్గించాయి. ఇపుడు చీకటి రాత్రి అక్కడ ఆవరించింది.

కళలు వికసించి, విజయోపేతమైన సామరస్యం ఏర్పడి అద్భుతరచనలు అనేకంగా వెలువడిన కాలం ప్రతి సమాజానికీ ఒకప్పుడు వుంటుంది. అలాంటి కాలాన్ని మహోన్నత దశ అంటాము. సోవియట్ సమాజం అభివృద్ధిలో ఇప్పుడే ఉషఃకాలం ఆరంభమయింది. చరిత్రలో కొన్ని దశాబ్దాలు కొన్ని గంటలు మాత్రమే మా రచయితలు వేగులవాళ్ళు (Scouts): అందుచేతనే మాకింకా పుష్కిన్‌లూ, టాల్‌స్టాయ్‌లూ లేరు. కాని తప్పకుండా అలాంటి రచయితలు అవతరిస్తారు. మా సమాజపు ఆ మహోన్నతదశ ఇంకా ముందు వుంది.

ఫ్రాన్సుకు నేడు బాల్జాక్, స్టెంధాల్, హ్యూగో, ఫ్లాబర్ట్, జోలాలులేరు. ఇంగ్లండుకు నేడు డికెన్స్, బైరన్, షెల్లీలులేరు. మరొక కొత్త స్టెంధాల్ లేక డికెన్స్ జన్మించాలంటే ఆ దేశాలలో చాలా మార్పు రావాలి. ఈలోగా అంతా వారి వెనకనే.

## 2

పాఠకుడు సాయంత్రం కిటికీ తెరగుడ్డలాగి ఓ పుస్తకాన్ని తెరచి చదవడం ప్రారంభించుతాడనుకోండి. అతడేదో దీర్ఘయాత్రకు ఉపక్రమించినట్లు

అతనికి కన్పించుతుంది. ఆ గ్రంథంలోని పాత్రలు అదే పట్టణంలో, అదే వీధిలో ఉన్నప్పటికీ, పాఠకుని గమ్యస్థానం ఏమిటి? ఈ పుస్తకంలో తాను కనిపెట్టగలనని అతడు ఆశించే దేమిటి? చరిత్రకు సంబంధించిన నవల అయితే అది విజ్ఞానాన్ని విస్తృతం చేయవచ్చు. చరిత్ర పుటలకు జీవం పోయవచ్చు. పీటర్‌ను గురించి అలెగ్జీ టాల్‌స్టాయ్ వ్రాసిన నవల నుంచి పీటర్ ది గ్రేట్ కాలాన్ని అధ్యయనం చేయడం కష్టం. కాని పీటర్ కాలం నాటి భావనలను ఈ నవల వ్యక్తపరచుతుంది. పాఠకునికి తెలియని స్థలానికి సంబంధించిన నవల లేక అతనికి తెలియని వాతావరణం చిత్రించే నవల, అతని విజ్ఞానాభివృద్ధికి పనికివస్తుంది. పాఠకుడు తన భూగోళ జ్ఞానం నెమరువేసుకోవడం జరుగుతుంది. అతడు మరొక జీవిత విధానాన్ని తెలిసికోడానికి ఉపయోగపడుతుంది. "అండ్ క్వాయిట్ ఫ్లోస్ ది డాన్" అనే నవలలో కోసక్‌ల జీవితాన్ని యెంత విస్తృతంగా చిత్రించినప్పటికీ, అందులోని ప్రకృతి దృశ్యాలు ఎంత మనోహరంగా వర్ణించినప్పటికీ, అవి షోలోకావ్ తన పాత్రల ఆంతరంగిక ప్రపంచాన్ని చిత్రించడానికన్నా ఎక్కువ ఉపయోగపడవు. ఆ నవలలోని గ్రిగరీ కథమీదనే పాఠకుని దృష్టి అంతా కేంద్రీకరించబడి వుంటుంది.

ఉక్కు ఎలా చేయాలనే దానికీ, లేక ఆధునిక భవన నిర్మాణ పద్ధతులు తెలుసుకోవడానికి పాఠకుడు ఆయా ప్రవీణుల వద్దకు వెళతాడు. కాని ఈ విషయంలో "భోగట్టాను పోగుచేసిన" లేక ప్రవీణులు చెప్పిన విషయాన్ని దాదాపు హృదయపూర్వకంగా ఇముడ్చుకున్న రచయిత వద్దకు వెళ్ళడు. ఒక నవలా రచయిత కన్న అనుభవం గల వ్యవసాయదారుడు వ్యవసాయ విషయాల గురించి చెప్పగలడు. ఎంతో కష్టపడి రాసే నవలా రచయిత కన్నా సైనికవ్యూహ సిద్ధాంతకర్త, స్టాలిన్‌గ్రాడ్ యుద్ధాన్ని గాని, కుర్‌స్క్ మలుపువద్ద జరిగిన యుద్ధం గురించి గాని బాగా చెప్పగలడు.

అయితే తనతోటి పౌరులకన్నా, సమకాలికులకన్నా రచయిత బాగా తెలుసుకోవలసిన రంగం యింకొకటి వుంది. అది మానవుని ఆంతరంగిక ప్రపంచం. ఒకపాత్ర ఆకారాన్ని, దాని పరిసరాలను వర్ణించాలంటే, దాని ఇల్లు కాని అది పనిచేసే ప్రదేశం గానికావాలి. కాని అది అంతకష్టమైన పనికాదు. అలాంటి వర్ణనలు సాధనాలే కాని లక్ష్యాలు కావు.

ఉదాహరణకు ఒక నవల పాఠకుని పొరుగువాడైన ఇవనోవ్ అనే అతన్ని గురించి అనుకుందాం. ఈ పాఠకునికి ఇవనోవ్ ఆకృతి గాని జీవిత విధానం గాని రహస్యం ఏమీకాదు. పాఠకుడు ఇవనోవ్‌ను చాలసార్లు చూచి వుంటాడు; మీటింగులలో మాట్లాడటం వినివుంటాడు; అతని ఇంట్లో కూడ

చూసి వుంటాడు. ఇవనోవ్ ఎంతో పరిచయస్తుడే అయినా అపరిచిత భూమి లాంటివాడే. తన పొరుగింటి ఇవనోవ్ ఆలోచనలనూ, దుఃఖాల్నీ, పనినీ, ప్రేమనీ, తప్పుల్నీ రచయిత చూపగల్గితే పాఠకుడాపుస్తకాన్ని ముగించగానే, తానెంతో తెలుసుకోగల్గాననని అనుకుంటాడు. ఇవనోవ్‌ను అర్థంచేసుకోగల్గానని భావించుతాడు. ఆ విధంగా తన్నుతాను కూడా బాగా అర్థంచేసుకోగల్గానని తెలుసుకోగల్గుతాడు.

ఇవనోవ్ లోహ కార్మికుడైతే, ఆ పరిశ్రమలో అతడెలా పనిచేస్తున్నాడో కూడా రచయిత చిత్రించాలని వేరే చెప్పనక్కరలేదు. మానవ జీవితంలో పని ఒక భాగం. అందులోనూ మన సమాజంలో అది చాలా ప్రధానమైన భాగం. అలాంటి పరిస్థితిలో లోహ పరిశ్రమను గురించి కూడా రచయిత తెలుసుకొని వుండాలి. అయితే ఇవనోవ్‌ను సర్వతోముఖంగా చిత్రించడానికే ఆ లోహపరిశ్రమ కర్మాగారాన్ని రచయిత చిత్రించుతాడుకాని, మిల్లింగ్ మెషిన్‌ను చిత్రించడానికి గాను ఇవనోవ్‌ను వర్ణించడు.

తనకంటె రచయిత మానవ మనోనైజాలను గాఢంగా అధ్యయనం చేశాడనీ, యక్స్‌రేల్లాంటి కళ్లు రచయితకు ఉన్నాయనీ పాఠకుడు భావించుతాడు. తన సహచరుల, సమకాలికుల, స్నేహితుల, శత్రువులను గురించి విశేష పరిజ్ఞానం లభించుందేమోనని ఒక నవల ప్రారంభించిన తర్వాత పాఠకుడు ఆశించుతాడు. తన జీవితాన్ని శోధించి పరిశీలించడానికి గాను తనను గురించి వాస్తవ పరిపూర్ణ జ్ఞానాన్ని పొందాలని అతడు ఆశించుతాడు.

లియోటాల్‌స్టాయ్ వర్ణించిన నాటి సమాజ ఆచారాలు గాని, ఆ సమాజ మూఢనమ్మకాలుగాని నేడులేవు. కాని త్రెఖ్‌గొర్నయా టెక్స్‌టైల్ మిల్లులలోని ఒక కార్మిక స్త్రీ, అనాకెరినినా బాధలు తలపోసుకుని విలపించుతుంది. ప్రేమ హృదయ, అరక్షిత స్థితిని, మాతృప్రేమబలాన్ని ఆమె గ్రహించుతుంది. గతకాలపు ఈ గాథ తన హృదయపులోతుల్ని చూడడానికి ఆ యువతికి తోడ్పడుతోంది. చనిపోయిన పాత సమాజపు ఆచారాలను గురించి నేర్చుకోడానికేగాక మానవ భావోద్రేకాల (Emotions) క్లిష్ట స్వభావాన్ని అర్థంచేసుకోడానికి కూడా టాల్‌స్టాయ్ నవలను ఆధునిక పాఠకుడు చదవడానికి ఉపక్రమించుతాడు.

టాల్‌స్టాయ్ అవగాహన చేసుకోలేని సామాజిక వైరుధ్యాలను లెనిన్ అద్భుతంగా చిత్రీకరించాడు. రష్యా అవలంభించవలసిన మార్గాలేవో లెనిన్‌కు స్పష్టం. కాని టాల్‌స్టాయ్ వాటిని చూడలేకపోయాడు. టాల్‌స్టాయ్ తత్వశాస్త్రంలోని నిరర్థకతను బయట పెట్టడానికి మాత్రమేకాదు, అతని

రచనలను లెనిన్ చదివింది. మానవుని ఆంతిరంగిక ప్రపంచాన్ని సంపూర్ణంగా అవగాహన చేసుకునేందుకు ఈ మహా రచయిత లెనిన్‌కు తోడ్పడ్డాడు.

త్రెఖ్‌గోర్నయా మిల్లులలో పనిచేసే ఒక కార్మిక యువతి సోవియట్ రచయితల మహాసభలో అన్నమాటలు ఇక్కడ జ్ఞప్తికి తెస్తున్నాను. టెక్స్‌టైల్ కార్మికుల గురించి కథలను, నవలలను వ్రాయలేదని ఆమె నిందించింది. ఇది జరిగి ఇరవై ఏండ్లయింది. టెక్స్‌టైల్‌కార్మికులే కథానాయకులుగా గల పుస్తకాలు ఆ రోజుల్లో చాలామంది రాశారు. మిల్లు లైబ్రరీలోని ఈ పుస్తకాలకోసం కార్మికులు ఎక్కువ ఆసక్తి చూపేవారుకాదు. అక్కడి స్త్రీలకు తమ సమకాలికులను వర్ణించడం కన్నా లెనిన్, వ్రాన్స్కీలు అంటే ఎక్కువ అభిరుచి వుంటుందా? ఉండదు. దీనినిబట్టి టెక్స్‌టైల్ కార్మికులను గురించి రాసిన ఆ నవలలు అక్కడి యంత్రాలను వర్ణించాయి. కాని ప్రజలను వర్ణించ లేదు. ఉత్పత్తి క్రమాన్ని వర్ణించాయి కాని మానవుని భావనలనుగాదు.

## 3

కోట్లకొలది సోవియటు ప్రజలకు ఉక్కు ఎలా తయారుచేయడమో తెలుసు. యాపిల్ పండ్లలో అనేక రకాలను ఆ తోటలనిపుణులు ఎలా ఉత్పత్తిచేస్తారో వారికి తెలుసు. అనేక అంతస్థుల పెద్దపెద్ద మేడలను ఎలా కడతారో వారికి తెలుసు. కాని నవలలను ఎలా ఉత్పత్తి చేస్తారో ప్రతి పాఠకునికీ తెలియదు. సృజనాత్మక కళ యొక్క మనస్తత్వాన్ని చాలా తక్కువ మంది అధ్యయనం చేశారు.

ఒకానొక రచయిత యొక్క విజయాన్నో, విఫలతనో విశదీకరించే పనికి పూనుకొనే మన విమర్శకులు, కళాత్మక రచన (గ్రంథం) ఎలాపుట్టిందో దానికి సంబంధించిన సమస్యలపై ఏమైనా కొంత వివరణ చేస్తారా? లేదు. దురదృష్టవశాత్తు మొదటి రకం విమర్శకులు సాహిత్యపండితులు ఇంకా మనకు కొద్దిమందే వున్నారు. కొంతమంది విమర్శకులకు రెండే రెండు రకాల పుస్తకాలుంటాయి. బహుమతి పొందిన నవలలు, పూర్తిగా నాశనం చేయదగిన నవలలు.

మొదటిరకం పుస్తకాలను సమీక్షించేటప్పుడు విమర్శకులు స్కూలు విద్యార్థిలాగా ఆ పుస్తకాలలోని విషయాలను వర్ణించుతారు. చివరకు తమ స్వతంత్రతను నిలబెట్టుకోడానికి, "అతిగా పొగిడాడు" అనే నిందలను ముందుగా తప్పించుకోడానికీ, ఆ నవలలో ఏదో ఫలానిది లోపించిందని చెబుతూ అందుకు రచయితను నిందించుతారు.

పూర్తిగా నాశనం చేయదగినవని అభిప్రాయపడ్డ నవలలను సమీక్ష చేసేటప్పుడు అలాంటి విమర్శకులు పబ్లిక్ ప్రాసిక్యూటర్ల పాత్ర వహించుతారు. మంచి ఉద్దేశ్యాలతో ఒక రచయిత ఒకనవలను వ్రాశాడనుకోండి. అది జయప్రదం కాలేదనుకోండి. ఆ రచయిత చిత్తశుద్ధిని ఏ మాత్రం సందేహించవలసినది ఆచరణలో అవసరంలేదనుకోండి. అయినా ఆ నవలను రచించడం ఆచరణలో ఒక నేరం అని విమర్శకులు భావిస్తారు. అలాంటి నవలలను గురించి మాట్లాడేటప్పుడు విమర్శకులు, ఆ పుస్తకాలలో విషయాలను ప్రస్తావించరు. అక్కడా ఇక్కడా కొన్ని వాక్యాలను లాగి వాటిని రచయితకు వ్యతిరేకంగా, సాక్ష్యంగా ఉపయోగించి ఉదహరించుతారు.

ఒక నవలను స్తుతించేటప్పుడు, లేక పూర్తిగా ఖండించేటప్పుడు, ఆ రచయిత వ్రాసిన యితర పుస్తకాలకూ, ఈ నవలకూ సంబంధం ఏమిటి? అన్న విషయాన్ని తరచుగా ఆలోచించనే ఆలోచించరు. పరీక్షాధికారులలాగా వాళ్ళు మార్కులిస్తారు గాని, రచయిత విజయానికి గాని, వైఫల్యానికి గాని కారణాలను విశదీకరించరు. కళాత్మక రచనలు ఎలా ఉత్పత్తి అవుతాయి? రచయిత స్వభావానికీ, అతని రచనకూ ఎంత సన్నిహిత సంబంధం వుంది? మొదలైన విషయాలను వివరించరు.

సోవియట్ యూనియన్‌లో లాగా రచయిత లంటేను, సాహిత్యం అంటేను వున్న అభిరుచి ఇదివరలో ఎప్పుడూ ఎక్కడాలేదు. పాఠకుల నుండి రోజూ వందలాది లేఖలు రాని రచయితలు సోవియట్‌లో ఉన్నారని నేననుకోను.

వినయభావంలేదని నిందించుతారనే భయాన్ని లక్ష్యపెట్టకుండా రచయితలు, తమ పాఠకులకు తమ రచనలను ఎలా ఊహించారో చెబుతున్నారా? తమ సాటి రచయితల పుస్తకాల గురించి వారు రాస్తున్నారా? ఒక కళాత్మక రచనను ఎలా సాకి ఉత్పత్తిచేశాడో అనుభవం ద్వారా వారికి తెలుసు. తమ సోదర రచయితల పుస్తకాలను మంగళాచరణంతోనో, శాపనార్థాలతోనో వీరు చూడనవసరంలేదు. సృజనాత్మక కళకు మూలం ఏమిటో వారు విశదీకరించ వచ్చు. మన రచనానుభవం గురించి, లేక ఇతరుల పుస్తకాలపై మన అభిప్రాయాల గురించి మన రచయితలు సాధారణంగా పాఠకులకు తెలియజేయరు.

కొందరు విమర్శకుల వ్యాఖ్యలలో పాఠకునికి శాపనార్థాలు తప్పకుండా కన్పించుతాయి. చాలాకాలం మౌనముద్ర వహించి ఏమీరాయలేదని రచయితను వారు ఆడిపోస్తారు. మరొక రచయిత యుద్ధం గురించి రాసిన నవలలో తమ మాతృభూమికి సంబంధించిన వీరులను సృజించనందుకు అతనిని దండించు

తారు. తగినంత ఆశను వెలిబుచ్చే పాత్రలు లేవనో, లేక అతి ఆత్మవిశ్వాసం కలిగివున్నాయనో మరో రచయితను నిందించుతారు. ఇలాంటి వ్యాసాలతో పాటు పాఠకులకు రచయితల నుండి కొన్ని హామీలు కూడా పత్రికలలో కన్పించుతాయి. ఫలానాఫలానా ప్రాజెక్టు నిర్మాణం గురించో, లేక ఫలానా పరిశ్రమశాఖను గురించో తాము నవలలు రాయదలచామని ఆ రచయితలు చేసిన వాగ్దానాలు అందులో కనబడతాయి. జాతీయ ఆర్థిక విధానంలోని ఫలానా శాఖను గురించి నవలలు రాయవలసిందని పత్రికా సంపాదకులు తమను ఫలానాచోటికి పంపుతున్నారని కూడా వారు రాస్తారు.

(ఇక్కడ నా ప్రకటనను వెంటనే వివరించవలసిన అవసరం వుంది. ప్రయాణం చేయటంవల్ల రచయితకుండే లాభాలను నేను కాదనడంలేదు. కాని చేతిలోనోట్‌బుక్ పెట్టుకొని ప్రయాణంచేసే రచయిత నవలకు కావలసిన "సామగ్రిని ప్రోగుచేయగలడా" అని సందేహం. సఖాలిన్‌ను సందర్శించిన తర్వాత చెకోవ్ కొన్ని సంక్షిప్త కథలు స్కెచ్‌లు గల గ్రంథాన్ని రాశాడు. ఆ ప్రయాణం చెకోవ్‌ను విజ్ఞానవంతుని చేసింది. ప్రజలను మరింత బాగా తెలుసుకొనేటట్లు సహాయపడింది. కాని అతని కథలలో ఆయన సఖాలిన్‌కు సంబంధించిన కథావస్తువులను తీసుకోలేదు. ఒక రచయితను మీరు మోల్డావియాకు లేక యాకూషియాకు లేక విదేశాలకు పంపవచ్చు. అతడు జర్నలిస్టుగా, బాగావనికి వస్తాడు. స్కెచెస్ రాయడం కష్టం; అది ముఖ్యమైన రచనా విధానం కూడా. ఒక రచయితను విదేశాలకు పంపినంతమాత్రాన, అతడు తిరిగి వచ్చేటప్పుడు తన సూట్‌కేస్‌లో ఒక నవలకు కావలసిన జీవాత్మను పట్టుకొని వస్తాడని అనుకోరాదు. ఒక నవలను రాసేటప్పుడు రచయితకు ఒక పట్టణాన్నో, ఒక ఫ్యాక్టరీనో సందర్శింపవలసి వుండవచ్చు. కాని ఇదంతా అతడు పుస్తకం రాయడానికి ఇచ్చిన ప్రేరేపణకు అనుబంధం మాత్రమే.)

ఆ విధంగా సాహిత్య సృజన ఒక విధంగా పారిశ్రామిక వస్తువుల ఉత్పత్తిలాగా కన్పించవచ్చు. తనకు రుచించని వస్తువును అమ్మడానికి ప్రయత్నించినపుడు, కొనేవాడు అమ్మేవానిపై కోపపడవచ్చు. తనకునచ్చిన డిజైన్‌లో ఆ వస్తువులేదని అతడనవచ్చు. అలాగే కొందరు పాఠకులు, ఫలానా ఫలానా పరిశ్రమ నిర్మాణాన్ని వర్ణించలేదనో, ఫలానా వృత్తిని వర్ణించలేదనో, కొన్ని మనోభావోద్రేకాలను వర్ణించలేదనో (అతడు ఇతర విషయాలను బాగా వర్ణించినా) అనవచ్చు.

మన కళ్ళముందరే సమాజం మారుతున్న కాలంలో, చాల త్వరితగతిని ప్రజలు అభివృద్ధిచెందుతున్న కాలంలో, మనం నివసించుతున్నాం. అయితే ప్రజలంతా ఒకేవేగంతో లేక ఒకే విధంగా అభివృద్ధిచెందరు. అందుచేతనే,

భావ వైరుధ్యాల (Spiritual Contradictions) మధ్య దిక్కు తెలియని రచయిత తన పాత్రల ప్రవర్తనను తప్పుగా చిత్రించుతాడు. అలాంటి రచయిత తప్పులను బయటకు తీసుకురావాలి. కోర్టు విచారణ లాంటి రుచిచూపించే విమర్శనాత్మక వ్యాసాలులేకుండానే యిది సాధ్యమవుతుందని, మార్క్సిస్టు ప్రామాణిక గ్రంథాలు (క్లాసిక్స్) మనకు తెలియజేశాయి.

సాహిత్య విమర్శకులు, రచయితల మరోకరపు పొరబాట్లను కూడా బయటపెట్టాలి. ఉదాహరణకు ఒక రచయిత గ్రంథంలో పాత్రల ప్రవర్తన పూర్తిగా, సరిగా వివరించబడినా, ఆ పాత్రలు సజీవంగా వుండవు. అలాంటి పొరబాట్లను బయట పెట్టాలి. తాను రాసే గ్రంథం తనలో ఒక పరిపూర్ణ భాగం అని రచయిత భావించని పుస్తకాలు, తన రచనకు ప్రసవవేదన లాంటి శ్రమను పడని పుస్తకాలు-రచయిత ఉద్దేశ్యాలయినప్పటికి కూడా-సాధారణంగా అవి చాలా తక్కువరకం పుస్తకాలవుతాయి. అలాంటి రచయిత తన పాత్రను తెలిసికోలేడు. వాటిని అర్థమూ చేసుకోలేడు. సృజనాత్మక రచన యొక్క మనస్తత్వం తెలిసివుంటే, విమర్శకులు అతని అపజయాలను విశద పరచడానికి అవకాశం వుంటుంది.

రచయిత దేనిపై బడితే దానిపైన ఎవరిపైబడితే వారిపైన రాయలేడు. విషయాన్ని ఎన్నుకోడంలోను, పాత్రలనుఎన్నుకోవడంలోను, ప్రతి రచయితకూ ఒక పరిమితి వుంది. ప్రతి రచయితకూ, అతడందరికన్నా గొప్పవాడైనా, కొన్ని అడ్డుగోడలున్నాయి. నవలా రచయిత యొక్క రచన అతను నివసించే సమాజం చేత నిశ్చయింపబడుతుంది. ఈ విషయం అందరికీ తెలిసినదే. కాని రచయిత స్వీయ చరిత్ర, తన అనుభవం, తన ప్రవర్తన చేత కూడా ప్రభావితుడై తన రచన సాగించుతాడు.

# 4

మన నవలలు, చిన్న కథలు కొన్ని పాఠకునిలో ఉపేక్షా భావం కలుగ చేస్తున్నాయని లెనిన్ గ్రాడ్ ఇంజనీర్ రాసిన విషయం నిజమే. శిల్పం సరిగా లేనందున ఇలాంటి భావం కల్గుతోందని విమర్శకులంటారు. కాని ఇందుకు కారణం మరోచోట వుందని నా భావం.

పాఠకుని ఉద్విగ్నపరిచే రచయితలు మనకున్నారు. దాదాపు వారంతా మంచి శిల్పులే. పాఠకుని కదల్చని రచనలు కూడా కొన్ని వున్నాయి. వాటిని బాగా రాయని రచనలని తప్పనిసరిగా అనడానికి వీలులేదు. గత పదేండ్లలోను మన రచయితల శిల్పస్థాయి పెరిగింది. యుద్ధానికి పూర్వంకంటె మామూలు నవల లేక కథ పూర్వంకన్నా ఎక్కువస్థాయి కలిగివుంది.

ఒకసారి, విప్లవానికిపూర్వపు పత్రికల ఫైళ్ళను తిరగేస్తున్నాను. "రస్కోయియా బొగాట్స్టువో" (Russian Riches "రష్యా సంపద") "జర్నల్ డ్ల్యావెక్" (Magazine for all "అందరి పత్రిక") "స్త్రావెమెన్నీ మిర్" (Modern World "ఆధునిక ప్రపంచం") మొదలైన పత్రికలను తిరగ వేస్తున్నాను. ఆరోజుల్లో చెకోవ్, గోర్కీ, బ్లాక్ మొదలైనవాళ్ళంతా రాస్తున్నారు. వారితో పాటు డజన్ల కొద్దీ మామూలు నవలా రచయితలూ, కవులూ, రాసినవి ప్రచురించబడినాయి. వారి రచనలు చాలా నిస్సారంగాను మోటుగాను వున్నాయి. వారి రచనలతో నేటి సాధారణ సోవియట్ రచయిత రచనలను పోల్చిచూస్తే, ఇప్పటి మన రచయితలే బాగా వ్రాస్తున్నారని చెప్పాలి.

కొన్ని పుస్తకాలు చప్పగా వున్నాయని లెనిన్‌గ్రాడ్ ఇంజనీర్ భావించడానికి కారణం వాటిలో శిల్పం లోపించడంవల్ల కాదు. కనీసం ఆఒక్క కారణం వల్ల మాత్రమే కాదు.

బాగా రాయడం ఎలా అని ప్రశ్నించినపుడు లియోటాల్‌స్టాయ్ చాలా విలువైన సలహాలు రెండిచ్చాడు: (1) నీకు సైతం అభిరుచి కల్గించని వాటిని గురించి రాయబోకు. (2) పుస్తకం రాయాలని నీకు ఉద్దేశంవుండికూడా, నీవు తప్పనిసరిగా దానిని రాసితీరాలి అన్న భావం నీలో కల్గకపోతే, అసలు రాయడమే మానివేయి.

యాంత్రికంగా ఘటనలను నమోదుచేసే యంత్రం కాదు రచయిత. పుస్తకాలు రాయడం తెలుసుకదా అని అతడు పుస్తకం రాయడు, లేక సోవియట్ రచయితల సంఘంలో సభ్యుణ్ణికదా అనీ రాయడు. ఇంతకాలంగా నీవు ఒక పుస్తకం అన్నా రాయలేదేమని రచయితను అడగవచ్చు. జీవించడానికి సంపాదించుకోవాలి గదా అనీ రచయిత పుస్తకాల్ని రాయడు. ప్రజలకేదో చెప్పాలని అతనికి ఉండబట్టే, ఏదో రాయాలని అతని బుర్రలో పుస్తకం 'బాధ' పెట్టబట్టే, ప్రజల్ని, విషయాల్ని చూచాడుగాబట్టే, తమను వర్ణించమని భావోద్రేకాలు మస్తిష్కంలో గోల పెట్టబట్టే అతడు వ్రాస్తాడు. అలా జన్మించాయి ఉద్విగ్నమైన పుస్తకాలు. ఒక్కొక్కపుడు వాటిలో కళాత్మకమైన లోపాలు కన్పించినప్పటికీ, అవి ఇంకా రచయితను తప్పని సరిగా ద్రవింపచేస్తూనే వున్నాయి.

ఈ కారణంచేత వాల్గా-డాన్ కాలువ గురించో, టెక్స్‌టైల్ పరిశ్రమను గురించో, శాంతి ఉద్యమంగురించో ఒక నవల రచయితను తప్పుపట్టే కొందరి విమర్శకులను నేను అర్థం చేసుకోలేను. అంతప్రేరణ లేకుండా ఒక పుస్తకం రాసే పుస్తకం రాయకపోయిన కాలం వెళ్ళబుచ్చగలిగిన రచయితను నిందించితే తప్పేమిటి? పారిశ్రామిక ఉత్పత్తిలో ముఖ్యపాత్ర వహించే

గణాంకాలు కళలో కూడ అదే పాత్రను వహించవు. వంద తుక్కు నవలల కంటే ఒక్క మంచి నవల మంచిదనే నా అభిప్రాయంతో మీరేకీభవించుతారని. అనుకొంటాను. నవలలు వంట చెరకులా (బొగ్గు) ఉపయోగపడే వస్తువులుకాదు లేక చెప్పులవలె అరిగిపోయ్యేవీ కావు.

ఎడారి దీవిలో రచయిత మనస్సులో మేఘావృతబింబాలు సాక్షాత్క రించ వచ్చు. కాని అతడు వాటిని గురించి పుస్తకం వ్రాయడానికి ప్రేరణ కల్గించక పోవచ్చు. రచయితలు ప్రజల గురించి ప్రజలకోసం వ్రాస్తారు.

మార్సెల్ ప్రౌస్ట్, ధ్వనిచొరబడని బిరడా బిగించినట్లు గోడల గదిలో గ్రంథాలను రచించినాడట. దీనిని ఆదర్శంగా రసజ్ఞులు చెబుతూవుంటారు. అయితే ప్రౌస్టు యీ నిశ్శబ్ద భవనంలో పనిచేసేముందు, ప్రజలతో కలిసి నివసించాడనీ, ఫ్రాన్సులోని సాంఘిక జీవితాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేశాడని వీరు మరచిపోతున్నారు. వాస్తవిక సాహిత్యం ఎప్పుడూ సమాజ జీవితంతో సంబంధం కల్గి యుంటుంది. రచయిత ఒంటరితనం, రచయిత 'గదులుకట్టుకొని' నివసించుతాడనడం (Ivory tower) మొదలైనవి బూర్జువా సమాజం క్షీణించడం మొదలు పెట్టగానే ప్రారంభమయ్యాయి: ప్రపంచ జాబితా పూర్తి అయిందని నవలా రచయితలు తలచినపుడు, వాస్తవానికి బదులు స్వప్నాలు ఆ స్థానంలో రావాలని వారు నిర్ణయించినపుడు పైన చెప్పిన విషయాలు ప్రారంభమయ్యాయి. (నేనిక్కడ యింకోమాట చెప్పవలసి యుంటుంది. స్వప్నాలు, అన్ని స్వప్నాలలాగానే, వాస్తవాన్ని ప్రతిబింబించుతాయి. అయితే ఆ ప్రతిబింబం వక్ర ప్రతి బింబం.)

కళాకారుని ఊహ (Imagination) దృశ్య ఘటనల, భావనల పనుల పాళ్ళను మార్చవచ్చు. కాని అన్ని నవలలు-విచిత్రమైన లేక ఊహాగానం చేసే నవలలైనాసరే-వాస్తవం మీదనే ఆధారపడి వుంటాయి. వెల్సు రచనలలో అంగారక గ్రహం (Mars)లోని మనుష్యులు, కాపెక్ నీరు ఉడుము (Newt) యివన్నీ కూడ మానవ సమాజాన్ని అపహాస్యంచేసే వినోదానుకరణ (Parady) లే. వెల్సు సృష్టించిన అంగారక గ్రహంలోని మనుష్యులు, కాపెక్ సృష్టించిన నీరుడుములు-ఇవన్నీ మన సమాజ అనుకరణలే. ఏడుపు ముఖం ప్రభువును ఊహించి చిత్రించేముందు సెర్వాంటిస్ తన సమకాలికులను బాగా ఎరిగి వుండాలి. వాస్తవికతకు దూరంగా కళ అనేది లేదు. ఉండబోదు.

సాంఘిక పరిసరాలు రచయిత భావాలను, ఇంద్రియజ్ఞానాలను, జీవితాన్ని, రచనలను నిర్ణయించుతాయి; తన పరిసరాలకు; తన సమాజానికి దూరమయితే రచయిత సృజనాత్మక కళ విషయంలో శుష్కించి చచ్చి పోతాడు. పాశ్చాత్య దేశాల సాహిత్యంకంటె ఎక్కువగా రష్యన్ సాహిత్యం

ఎప్పుడూ ప్రజలతో సన్నిహిత సంబంధం కలిగివుంది. సామాజికంగా శూన్య వాదంలోకి తప్పించుకొని పోయే ఉదాహరణలు ఇందులో చాలా తక్కువ. పుష్కిన్ తర్వాతి కాల వారసులుగా పేర్కొన దగినవారని, నాశిరకం కవులు, నవలా రచయితలు, తమ జీవిత ప్రారంభములో ప్రతీక వాదులు (సింబాలిస్ట్సగా) వున్నవారూ ఇలా కొద్ది మందిని ఉదాహరించవచ్చు. (చాలమంది ప్రతీక వాదులు తర్వాత జీవితంతో సంబంధం పెట్టుకోడానికి ప్రయత్నించారు. ఉదాహరణకు అలెగ్జాండర్ బ్లాక్ విషయంలో ఇది స్పష్టంగా కన్పించుతుంది. "సుందర యువతిని గురించి గేయాలు" (Poems about a beautiful lady)రాసిన బ్లాక్ తర్వాత "నెమెసిస్" ప్రాయశ్చిత్తాది గురించి, రష్యా గురించి పద్యాలు రాశాడు. చివరకు పన్నెండు (The Twelve) అనే రచన సాగించాడు.

సోషలిస్టు సమాజంలో రచయితకూ ప్రజలకూ మధ్య సంబంధం వుండడమే గాదు. అలా వున్నదనే భావాన్ని స్పష్టంగా గ్రహించుతారు కూడా. ఒకప్పుడు సమాజవిధిని నిర్వర్తించడమని కూడా దానిని పిలుస్తారు. కాని కొందరు సంపాదకులు, విమర్శకులు "విధి" అనే పదాన్ని వదిలివేస్తారు. "సామాజిక" అనేపదాన్ని విస్తరింపజేసి "వ్యవహార సరళి తెలిసిన ప్రపంచం"గా ఆ పదాన్ని మార్చివేస్తారు. కాని రచయితల శిల్పానికి "వ్యవహారసరళి తెలిసిన ప్రపంచం" అనే పదం బొత్తుగా సరిపడని విషయం. విప్లవానికి పూర్వం రచయితల పరిస్థితి అంత సరళంగా వుండేదికాదు. వార్తా పత్రికలు, మాస పత్రికలు కథలు పంపించవలసిందని ఆజ్ఞాపించిన ఘటనలు, చెకోవ్ ఉత్తరాలలో కన్పడుతుంది. అయితే ఎంతటి మొదటి సంపాదకునికి కూడా ఆయనకు ఫలాని విషయంమీద కథ రాయవలసిందని సూచించే సాహసం ఉండేదికాదు."అనా కెరనినా"ను రాయమని టాల్‌స్టాయ్‌ను, "అమ్మ" అనే నవలను రాయమని గోర్కీని ఎవరైనా ప్రచురణకర్త అడుగుతాడని ఊహించగలమా?

తాను ఏ విషయం గురించి ఏమి రాయాలో ప్రతిదీ చెప్పించుకోవలసి నంత వ్యక్తిత్వంలేని రచయిత ఎవడూ ఉండడు.

రచయితలకు గాఢావేశం లేకుండా రాసిన పుస్తకాలు ఏదో ఒక పత్రికా సంపాదకవర్గం నిర్దేశించితే రాసిన పుస్తకాలు ఎవడికైనా కావాలా? టాల్‌స్టాయ్ చెప్పిన పై సలహాను కాలదన్ని, తనను కదిలించిన విషయాన్ని గురించి రాస్తే, ఆ పుస్తకం పాఠకుని కూడా కదల్చదు. దాని ఫలితం లెనిన్ గ్రాడ్ ఇంజనీర్ రాసినట్లు "ఆ రచనలో ప్రతిదీ వుంటుంది. కథ బాగానే ప్రారంభమవుతుంది. సుఖాంతంగానే ముగుస్తుంది. కొంత ఘర్షణ, కొంత

వరకు కథా కల్పన (ప్లాట్లూ) వుంటుంది. అయితే అందులో ఆత్మ శూన్యం. ఎంతో సానుభూతిగల పాఠకుని గూడా అది ఉత్సాహపరచదు.''

# 5

బూర్జువా సిద్ధాంతాన్ని పట్టుకొని సమర్థించే సోవియట్ రచయితలనూ, అభ్యుదయ రచయితలనూ పక్షపాత (Tendentious) ధోరణి కలవారని నిందించుతారు. ఫ్రెంచి శబ్దకోశంలో "Tendentious'' టెండెన్షియస్ అనే పదానికి "ఒక విషయంపట్ల మొగ్గుట'' అని అర్థం. అందుచే అందరి ప్రజల లాగానే రచయితకూడా కొన్నింటిని ప్రేమించడం, కొన్నింటిని ద్వేషించడం సహజమే. తమ సమకాలీనులతో రచయిత విభేధించుతున్నాడంటే అతని భావాల (Feelings) సున్నితత్వం వల్లనేగాని మొద్దుబారటం వల్ల కాదు. రచయిత న్యాయంవైపు, హేతువాదంవైపు, సౌభ్రాతృత్వంవైపు మొగ్గవచ్చు. లేక అతడు సామాజిక అసమానతవైపు, అజ్ఞానంవైపు, జాతీయ దురహంకారంవైపు మొగ్గవచ్చు. ఆ విధంగా అతడు గర్వపోతుదనంవైపు, మతం వైపు, జాతీయదురహంకారంవైపు అతడు మొగ్గుదల చూపవచ్చు. ఆవిధంగా తన నిజమైన మొగ్గుదలకు ముసుగు వేసి అహంకారతత్వంగా (ఎరిస్టో క్రాటిక్ స్పిరిట్), మతంగా, దేశభక్తిగా ప్రదర్శించవచ్చు.

గత శతాబ్దంలోని రష్యన్ మహారచయితలు, ఇప్పుడు "పక్షపాత ధోరణి'' అనే పిలువబడే ఉద్వేగానికి (Passion) భయపడేవారుగారు.

డాంటే తన సమకాలీనుల గాఢభావాలను పంచుకొన్నాడు, తనకాలం నాటి రాజకీయ పోరాటాలలో పాల్గొన్నాడు, తన అనేక గేయాలను ఆ రాజకీయ పోరాటాలకు అంకితం చేశాడు. పక్షపాతధోరణి 'డివైన్‌కామెడీ'ని సృష్టించుటలో తోడ్పడింది కాని అడ్డుతగలలేదు. 13 వ శతాబ్దంనాటి పౌర సంబంధ తుఫానులు ఈనాటికీ ఆ రచన మనల్ని కదిపివేస్తుంది.

నెపోలియన్ సైనికులు స్పానిష్ గెరిల్లాలను ఉరితీసిన దృశ్యాన్ని గోయా చిత్రించాడు. ఇది అత్యంత పక్షపాత ధోరణి కలవాటిలో ఒకటి అయినా ప్రపంచంలో అత్యంత సౌందర్యవంతమైన చిత్రకళా ఖండాలలో ఇదీ ఒకటి. తర్వాత 70 ఏండ్లకు ప్రముఖ ఫ్రెంచి చిత్రకారుడు ఎడ్వర్డ్ మానెట్ మరొక చిత్రం గీశాడు. చక్రవర్తి మాక్జి మిలియన్‌ను మెక్సికన్ తిరుగుబాటుదారులు ఉరితీసిన దృశ్యం అది. రాజకీయ భావప్రేరేపణతో ఈ విషయాన్ని ఎన్నుకొని ఈ చిత్రం గీశాడో, లేక స్పానిష్ చిత్రాన్ని ముఖ్యంగా గోయా చిత్రాన్ని ప్రేమించినందువల్ల యీ చిత్రాన్ని గీశాడో మనకు తెలియదు.

అద్భుత ప్రవీణుడుగా అతని కళానైపుణ్యగుణాలు అన్నీ దానిలో ఉన్నప్పటికీ ఆ చిత్రం మనల్ని కదల్చదు. తన కాన్వాస్‌లో గోయా పక్షపాత ధోరణి అవలంభించాడు. విదేశ సైనికులను అతడు ద్వేషించాడు. గెరిల్లాల సాహసాన్ని మెచ్చుకొన్నాడు. కాని మానెట్ అభిప్రాయాలు మనకు స్పష్టంగా తెలియవు. అతడు తిరుగుబాటుదారులకు సానుభూతి చూపెడుతున్నాడో, మాక్జిమిలియన్ స్థితికి జాలిపడ్డాడో మనకు బోధపడదు. తన వైఖరి ఏమిటో వ్యక్తపరచకుండా అతడు ఆ ఘటనను చిత్రించాడు. అందుచేతనే అతని కాన్వాస్ అంత నిర్జీవంగా ఉండటానికి కారణం.

పక్షపాత ధోరణిని వ్యతిరేకించుతూ, "కళ కళకోసమే"నని తన యౌవన దశలో బ్రయుసావ్ ప్రచారం చేశాడు. "స్వప్నాలన్నీ నాకు సన్నిహితమైనవే. పలుకులన్నీ నాకు ప్రియతమమైనవే; నాగేయాన్ని దేవుళ్ళందరికీ అంకితం ఇస్తాను.'' అనేవాడు.

"రోడ్స్ అండ్ క్రాస్‌రోడ్స్''అనే గ్రంథ రచయిత అయిన బ్రియుసావ్ పాఠకుని కదల్చలేకపోయాడు. అతడు కవి అవునా కాదా అని విమర్శకులు చర్చించారు. కవితా నైపుణ్యం అతనికి లేదని చాలామంది వాదించారు. పాఠకులు తమ జీవితకాలమంతా ఏ కవులను గురించి జ్ఞాపకం పెట్టుకుంటారో ఆ కవులలో వుండే కవితా ప్రతిభ బ్రియుసావ్ కూడా కలిగియున్నాడని నా అభిప్రాయం. అయితే విప్లవానికి పూర్వపు బ్రియుసావ్ అంటే పాఠకులు నిర్లక్ష్యంగా ఉంటానికి కారణం కనుగొనడం సులభమే. అతడు జీవింతపట్ల నిర్లక్ష్యంగా వుండేవాడు. అయితే ఈ నిర్లక్ష్యం అతని స్వభావతః వచ్చింది కాదనిపించుతోంది. కళ అంటే అతనికి గల అవగాహనలో ఇది ఇమిడివుంది. అందరి దేవుళ్లకూ మొక్కేవాడికి ఏ దేవుడిలోనూ నమ్మకం ఉండదు. అలాగే అందరి స్త్రీలనూ ప్రేమించుతానని చెప్పుకునేమనిషి ఏ స్త్రీనీ ప్రేమించడు.

1812 నాటి యుద్ధాన్ని వర్ణించినపుడు టాల్‌స్టాయ్ సానుభూతి ఎలా వుండేదో స్పష్టంకాదా? "A portsman's Skeiches" (ఆటగాని జీవిత చిత్రాలు) అనే గ్రంథ రచయిత దేనిని ద్వేషించుతున్నాడో ప్రేమించుతున్నాడో తెలియడం కష్టమా? రష్యన్ ప్రజలకూ-బుద్ధిహీనులూ, చిత్తశుద్ధి లేనివాళ్ళూ, మొండిబండలూ అయిన రష్యన్ ఉన్నత వర్గాలకూ-మధ్య జరిగే పోరాటంలో సాల్టికోవ్-షెడ్రిన్ తటస్థంగా వుండాలని తలచాడా?

"As simple as Mooing" (యాజ్ సింపుల్ యాజ్ మూయింగ్) అనె పుస్తకం మొదలు తాను మరణించేముందు రాసిన గేయాలవరకు మయకోవస్కీ రచనలన్నీ పక్షపాత వైఖరి కలవే. ఈ మహాకవి రచనల గురించి ఇటీవలనే చర్చ జరిగింది. నిజానికి చర్చ వివరాలను చదివేటప్పటికి

నే నాశ్చర్య పడ్డాను. మయకోవస్కీ లాగా కవులంతా రాయాలని ఒక ఉపన్యాసకుడు సలహా ఇచ్చాడు. (నెక్రసోవ్‌కు వారసుడవడం కంటె, మయకోవస్కీకి వారసుడవడం అనే భావం కొత్తదిగానీ, సాహసోపేత మైనది గానీ కాదని నా అభిప్రాయం.)

"మయకోవస్కీ ఎలా రాశాడన్నది కాదు ముఖ్యం; అతడు ఏమి రాశాడన్నది ముఖ్యం" అంటూ మరికొందరు వాదించారు. మయకోవస్కీ అసలు ఆయన (మయకోవస్కీ) రాసినట్లే రాయలేదని రుజువుచేయడానికి కొందరు ప్రయత్నించారు. నూతనమైన ఇతివృత్తానికి తగిన నూతన రీతులను మయకోవస్కీ సృష్టించాడు. అతడు మొదట్లో రాసిన గ్రంథాలకు తర్వాత రచనలకూ పూర్తి సంబంధంపుంది. బర్ల్యాక్‌కు "పూచరిజం" ఒక సౌందర్య దృష్టితో కూడిన ధోరణి; యువ మయకోవస్కీకి అది తాను ద్వేషించిన సమాజ నీతులను, తత్వశాస్త్రాన్ని, సౌందర్యదృష్టినీ దెబ్బగొట్టేందుకు ఆయుధం. ఈ ఆయుధం ఎంతవరకు ఫలితాన్ని ఇవ్వగలశక్తి కలది అనే విషయంలో సందేహం ఉండవచ్చు. కాని ఎప్పుడూ మహోన్నతమూ, గాఢావేశభరితమూ అయిన మయకోవస్కీ హృదయం గురించి ఎవరికీ ఎలాటి సందేహమూ లేదు.

రచయిత వినోదం కోసం, పేరు ప్రతిష్ఠలకోసం రాయడు. ప్రజలను బాగుచేయాలని, జీవితాన్ని మరింత ఉన్నతపథాలకు నడపాలని రచయిత భావించుతాడు. ఈ పోరాటంలో పుస్తకాలను ఒక నైతిక ఆయుధంగా అతడు భావిస్తాడు.

రచయిత తన నవలలోని రంగస్థలంలో తెరముందుకు వచ్చి ఎప్పుడూ పాఠకులికి తన పాత్రల పట్ల తన వైఖరిని గాని, తాను వర్ణించే ఘటనలపట్ల తన వైఖరిని గాని చెప్పుకోవలసిన పనిలేదని నా అభిప్రాయం. ఒక నవలలోని పక్షపాత ధోరణి (Tendentiousness) కి మూలం దానిలోని గాఢావేశం అని నా అభిప్రాయం. ఉన్నత ఆశయాలతో ప్రేరితుడైన రచయిత, సామాజిక అభివృద్ధిని అర్థంచేసుకొన్న రచయిత తాను సృజించిన పాత్రలలో కొన్నిటికి జీవమూ, న్యాయమూ జీవనశక్తి వుండటం, మరికొన్ని పాత్రలలో అన్యాయమూ, తప్పనిసరియైన పతనమూ వుండటం, గమనించుతాడు.

రచయితలోని గాఢావేశం అంటే నిర్వ్యాజమైన నిస్సహాయ పక్షపాతం అని అర్థంకాదు. దురాశను, ద్వంద్వధోరణినీ బూటకత్వాన్ని రచయిత ద్వేషించవచ్చు కాని పిసినిగొట్టువానికీ, ద్వంద్వధోరణి కలవానికీ బూటకపు మనిషికీ కూడా మానవనైజాలు ఉంటాయనేది అతడు మరువలేడు. ప్రపంచాన్ని రెండు రంగుల్లోనే - నలుపుతెలుపుల్లోనే - (మంచి, చెడ్డ) చిత్రించరాదు.

ప్రేమలాగానే ద్వేషంకూడా సజీవప్రజలను నిర్దిష్ట ప్రజలను గురించి చర్చించే విషయం. ఏవో అస్పష్టభావనలకు సంబంధించిన విషయం కాదు.

చారిత్రిక క్రమగతుల అవగాహన, మానవజాతి భవిష్యత్తును గురించి స్పష్టమైన అభిప్రాయమూ, అభ్యుదయ రచయితను సంకుచిత పరచక విశాల దృష్టిని కల్గించుతాయి. రాబర్ట్ మెర్లీ అనే అతను వ్రాసిన "మరణం నావర్తకం" (Death is my trade), అనే నవల ఇటీవలనే ఫ్రాన్స్‌లో వెలువడింది. ఒక మృత్యు శిబిరానికి కమాండర్‌గా పనిచేసిన ఫాసిస్ట్ కథను ఈ రచయిత తెలియజేస్తాడు. ఈ పుస్తకం రచన బాగానే రాశాడు; నైపుణ్యమూ వుంది. కాని ఆ ఫాసిస్టు కూడా జీవించివున్న ఒక మానవమాత్రుడనే విషయాన్ని రచయిత కొన్నిసార్లు స్ఫురింప చేయలేకపోయాడు. నవల పూర్తిఅయేసరికి అతనిని రాక్షసునికి మారురూపమైన పరిహాసచిత్రం (కేరికేచర్‌గా) గా చిత్రించాడు. ఇది పక్షపాత ధోరణి వల్ల లోపంకాదు. చారిత్రిక క్రమాల్ని అర్థం చేసుకొనకపోవడమే. ఫాసిజాన్ని రచయిత ఒక ప్రక్క ద్వేషిస్తున్నా, అందుకుగల సామాజిక మూలాలేమిటో చూడటం లేదు. అందుచే దానిని ఎదిరించడానికి కూడా ఏమిలేదు.

జర్మన్ కమ్యూనిస్టు అన్నా సేఘర్స్ రాసిన "The Dead stay Young" (చనిపోయిన వారింకా యువకులే) అన్న నవలలో ఫాసిస్టుల నెత్తురూ, కండలూ వున్న సజీవపాత్రలు. వాళ్ళల్లో కొందరికి కొన్ని మంచి గుణాలు లేక పోలేదు. కాని వారంతా భయంకరమైన నేరాలు చేస్తారు; లేదా ఆ నేరాలను కప్పి పుచ్చుతారు. పక్షపాత ధోరణి, అన్నా సేఘర్స్‌కు ఎక్కువ అంతరదృష్టి ఏర్పడడానికి అవకాశమిచ్చింది. ఆమె మరింత ప్రామాణిక చిత్రాన్ని కళాత్మకంగా రచించడానికి సహాయపడింది.

"బీళ్ళు దున్నేరు" (The Soil - upturned) అనే గ్రంథంలో షోలకోవ్ పక్షపాత ధోరణి కనపరచాడు. ఎందువల్లనంటే రైతాంగంలో వచ్చిన కష్టమైన మార్పు అభ్యుదయానికి ఒకమెట్టు అని అతనికి తెలుసు. ఈ పక్షపాత ధోరణి కులక్‌ల ఆత్మలోకి చొచ్చుకుపోడానికి షోలకోవ్‌కు సహాయపడింది. అందుచేతనే అతడు ఘటనలను నిర్జీవంగా పోస్టర్‌లాంటి బొమ్మలలాగా చిత్రించ లేదు. మనస్తత్వ సత్యంతో నిండిన చిత్రాన్ని చిత్రించగల్గాడు.

గాఢావేశం లేనిదే నిజమైన కళ లేదనీ, ఉండబోదనీ నా నమ్మకం. ఆత్మపరమైన నిరుత్సాహాన్ని పోగొట్టడం కంటే శైలిలోని దోషాలను, నిర్మాణంలోని బలహీనతలను, ఇతర సాహిత్యలోపాలను పోగొట్టుకోవడం సులభమే. ఈమధ్య అసలు వాడని కొన్ని పదాలను ప్రస్తుతానికి తెచ్చుకోవడం అవసరం. ప్రబోధం (Calling) ప్రేరణ (Inspiration) సేవ (Service) మొదలయిన పదాలవి.

ఈ పదాలు నిజంగా హాస్యాస్పదమైనవిగానీ, దుల్లపదాలుగానీ కావు. రచయిత యొక్క విద్యుక్తధర్మాల్ని నిజంగా అర్థంచేసుకోవడానికి ఉపయోగపడే పదాలివి. తనకున్న కొద్దిపాటి జీవితంలో రచయిత అనేక జీవితాలను జీవించాలి. ప్రజల హృదయాలలో ఉత్సాహం రేకెత్తించాలి. అలా చేయడానికిగాను మానవుని ఆంతరంగిక ప్రపంచంలో వెలుగును ప్రసారించి, పాఠకుడు దానిని మరింత స్పష్టంగా చూడడానికీ, సమగ్రంగాను, సగర్వంగాను జీవించడానికి అతనికి రచయిత తోడ్పడాలి.

# 6

ఒకానొక రచయితను ప్రశంసించేటప్పుడు అతనికి "బుద్ధికుశలత" వుందంటాము. ఇంకా కొంచెం నమ్రతగా చెప్పాలంటే "సామర్థ్యం" వుందంటాం. ఈ మాటలకు సరిగ్గా అర్థం ఏమిటో కనుక్కోడానికి మీరు ప్రయత్నించితే, "అతడు బాగా రాస్తాడు." అనో లేదా "కాలక్షేపం బాగా సాగిస్తాడు" అనో, అతనిలో "అభిరుచిని కల్గించే అభిప్రాయాలు" ఉన్నవనో, "అతడు బాగా పరిశీలించేవాడు" అనో సమాధానం వస్తుంది.

కొందరు పదజాలం అంటే పడిచస్తారు. మరికొందరు సంగీతానికి, చిత్రకళకు పడిచస్తారు. కవిమాట అలావుంచి కథారచయితగాని, నవలా రచయిత గాని వార్తాపత్రికలలోని మామూలు పదజాలంతో తృప్తిపడి పరిమిత పదాలను నిర్లక్ష్యం చేస్తాడని ఊహించడం కష్టం. భాషపట్ల రచయితకుగల భావనతో సన్నిహితంగా అతని నైపుణ్యంకూడా ముడివడి ఉంటుంది. నిరంతరం కష్టపడి పని చేయడంవల్లనే అతని పనితనం అభివృద్ధి చెందుతుంది. రచయితకు మంచి శైలి, పనితనం వుండవచ్చు. కాని అతడు పాఠకుని హృదయాన్నీ, మనుస్సునూ కదప లేక పోవచ్చు. హ్యూగో, బౌడలైర్, వెరైస్, రాంబౌద్ మొదలైనవారు ఫ్రాన్స్ చైతన్యంతో యింకా జీవించివున్నారు. కాని పార్నా సియన్స్ (19వ శతాబ్దపు ఫ్రెంచి కవుల) రచనలను ఎవరు చదవగలరు? లెస్కావ్ నైపుణ్యం గురించి నాకు మంచి అభిప్రాయమే వుంది. కాని ఆ ప్రముఖ రచయిత తన పాఠకుల హృదయాలను ఆకట్టేకదల్చలేక పోయాడు.

రచనకౌశల్యం మాత్రమేగాక, నవలను పాఠకులు ఆసక్తితో చదివేట్టు దాని సంవిధానం వుండాలి. రచయిత కౌశల్యం అంటే మాటలకోసం అర్ధరాత్రి మాత్రమేగాదు. కల్పనా శక్తికూడా వుండాలి. మామూలుగా ఆలోచన అని పిలువ బడేది సృజనకు పునాది అని వేరే చెప్పనక్కరలేదు. నూతన భౌతిక లేదా ఆధ్యాత్మిక విలువలను సృష్టించే ప్రతివానికీ-అతడు భౌతికశాస్త్రవేత్తగానీ,

శిల్పిగానీ, రాజకీయవేత్తగానీ-ఇది అవసరమైనట్లుగానే నవలలోని రచయితకు కూడా అవసరం. సంవిధానం (ప్లాట్) ఒక్కటే పాఠకుని ఆకర్షించదు. అంత కంటే ఎక్కువైన మరోదానికి అతడు ఆకర్షింపబడతాడు. 19వ శతాబ్దంలో రష్యన్ సాహిత్యం (డాస్టోవస్కీ మినహా) తంత్రాలతో కూడిన ప్లాట్‌ను నిరసించింది. 19వ శతాబ్దపు రష్యన్ సాహిత్యం అసాధారణమైన యదార్థ పూరిత సాహిత్యం గనుక, డ్రామటిక్ (ఆకస్మిక విస్మయ) ఘటనలు మరీ యెక్కువ వుండటం అసంబద్ధమని తలచింది. ఎందుచేతనంటే యిలాంటి ఘటనలు జీవితంలో యెక్కువగా వున్నప్పటికీ, కళాత్మకంగా రచించవలసి వచ్చేటప్పటికి, కృత్రిమంగా తయారవుతాయేమోనని అది భయపడింది. ఉద్రిక్తపరిచే ప్లాట్ లేనంత మాత్రాన తుర్జెనివ్, చెకోవ్ కథలు మన అభిరుచిని తగ్గించాయా? బిగువైన సన్ని వేశాలను పెంపొందించడంకన్న ఇంకా అవసర మైంది మరొకటి రచనకు వుంది. మంచి ఆలోచనాశక్తి రచయితలకు వుండడం మంచిదే. కాని అది వొక్కటే చాలదు. మంచి తెలివితేటలతో వ్రాసినవీ, కాలక్షేపం కల్గించేవీ చాలా పుస్తకాలు వుంటాయి. వాటిని త్వరగా చదవవచ్చు. గబగబా "మింగేయ" వచ్చు కాని వాటిని త్వరలోనే మరచిపోతారు పాఠకులు. వాటిలో గాఢత లేదు కాబట్టి పాఠకుడు వాటిని వూరికే అలా త్రిప్పివేస్తాడు.

బహుశా రచయిత ప్రతిభకు అవసరమైన గుణం చరిత్రక్రమాన్ని అవగాహనచేసుకొనే సామర్థ్యం కల్గియుండటం, వీధి మానిసికంటె మానసికంగా ఎదగని రచయితను మనం ఊహించడం కష్టం. తాను జీవించుతున్న కాలాన్ని అర్థం చేసుకొనడం, చారిత్రక పర్వత శిఖరాగ్రంనుంచి అవలోకించడం, పూర్వం వలె అన్ని వేళలా రచయితల ప్రత్యేకలక్షణంకాదు. కళావేత్త బాల్జాక్‌కూ, రాజకీయవేత్త బాల్జాక్‌కూ నిరంతరం పరస్పర వైరుధ్యం వుంది. మానవుల హృదయాల్నీ, మనస్సుల్నీ లోతుగా తరచిచూడగల అపారజ్ఞానంగల టాల్‌స్టాయ్ సాధారణ, సామాజిక తత్వవేత్తగానే వుండిపోయాడు. సామాజికాభివృద్ధి మార్గాలను గురించి ఆధునికరచయితకు నేడు ఎక్కువ తెలుసు. అద్భుతమైన ముందు హెచ్చరికలమీదగాని, వివాదాస్పదమైన ఊహాగానాల మీద గాని అతడాధారపడవలసిన పనిలేదు, తనని అత్యద్భుతంగా సమర్థించు కొన్న శాస్త్రీయ సిద్ధాంతం ఒకటి అతని కళ్ళముందు వుంది. మార్క్సిస్టు పరిశీలన ప్రాముఖ్యతను అర్థం చేసుకొనని పాశ్చాత్య రచయితలు మనతరంలోని విషమఘట్టాలలో ప్రజలతో సంబంధం లేకుండా పోయారు. స్వల్ప విషయాలను ప్రశంసిస్తూ రాయడమో, లేక ప్రపంచంలో ఉన్న దాన్నంతా తిరస్కరించుతూ రాయడమోతప్ప వాళ్ళ రచనల్లో ఏమీలేదు. ఇప్పుడు జరుగుతున్న దేమిటో అర్థంచేసుకోవడం ఒక్కటే చాలదు. గతకాలంలోని అద్భుత చింతనాపరుడు

నిర్లక్ష్యంగా రాసిన నవలలు కొన్ని వున్నాయి. వారి పుస్తకాలలోని పాత్రలకు పేర్లు, ప్రత్యేకలక్షణాలు, వృత్తులు మొదలైనవి వుంటాయి. అయినా వాళ్ళు సజీవప్రజలు కారు. యధార్థతను లేక భ్రాంతిని చూచాయగా వర్ణించే రేఖా చిత్రాలు (స్కెచెస్) మాత్రమే.

రచయితకు ఎక్కువ పరిశీలనా శక్తి ఉన్నదనే అంశం యింకొకటి వుంది. 'పరిశీలన' అన్న పదానికి శబ్దకోశార్థం, "ఇతరుల దృష్టినుండి తప్పించుకు పోయిన దృక్ప్రపంచ వివరాలను, విశేషాలను వాస్తవాలను అవలోకించే శక్తి" అని నిర్వచించింది. సహజంగానే రచయిత వివరాలను గమనించే శక్తిగల్గి యుండాలి. ప్రతిదానినీ అతడు వర్ణించలేనిమాట నిజమే. వివరాలు తెలిసీ వుండటం వల్ల అతడు తాను సృజించే పాత్రలను, వాటి పరిసరాలను, జీవిత విధానాన్ని విస్పష్టంగా చిత్రించగలడు.

టాల్‌స్టాయ్ నవలలోని పాత్రల వర్ణనలకు ముగ్ధుడుకానివాడెవ్వడు? నిశిత పరిశీలనచేసి, మంచి నైపుణ్యంతో యెన్నుకున్న వివరాలే ఆ వర్ణనలు. ఐతే ఇతరులు దృష్టినుండి తప్పించుకొన్న వివరాల పరంపరలను నమోదు చేయడం వరకే రచయిత పరిమితమై వుండాలని నేను అనను. ఒకవ్యక్తి ప్రవర్తనను నిర్ణయించే అతని మానసిక పరిస్థితిని రచయిత చూస్తాడనడం సరియైనదే. ఇతరులు ఆ వ్యక్తిలో గమనించనిసీ, ఆ వ్యక్తియే అసలు ఒకానొకప్పుడు గ్రహించని విషయాలను రచయిత గమనించుతాడు. ఇది నవలా రచయితలు సజీవ పాత్రలను సృష్టించడానికి తోడ్పడుతుంది. అలాంటి పాత్రతో పుస్తకాలురాసి ప్రజలకు అతడు అందించగలడు.

వార్తాపత్రికకు చెందిన ఫోటోగ్రాఫర్ కూడా పరిశీలకుడు కావచ్చు. అతడు కూడా చిత్రమైన వివరాలను విలక్షణమైన ముఖాలను, దుస్తులను, ప్రకృతి దృశ్యాలను పరిశీలించవచ్చు. రెంబ్రాంట్ కూడా పరిశీలకుడే. అయితే అతని పరిశీలన మరో విధమైనది. అతడు చిత్రించిన చిత్రాలనుచూస్తే, అతడు తన చిత్రాలకు నమూనాలుగా తీసుకున్న వ్యక్తుల జుట్టు, చర్మం, ఆకృతి, బట్టలు వగైరా మాత్రమేగాక, వారి హృదయాల్లోకి గూడా చూడగల్గాడు. అలాంటి పరిశీలనాశక్తులను కళాకారుడు కల్గియుండాలి. మానవుల అంతర్యాన్ని చూడగల్గడమే; రచయిత నిపుణతలోని ముఖ్యస్వభావం.

## 7

ఇతరుల నుండ ప్రజలంటే అభిరుచి, ప్రేమ, గ్రహించే స్వభావం మొదలైనవి రచయిత స్వాభావిక లక్షణాలు. కాని ఎలాంటి వ్యక్తినైనా అతడు అర్థం చేసుకోగలడని అనుకోవడం అమాయకత్వం అవుతుంది. ప్రజలంతా-రచయితలతో సహా-తమ అనుభవ పరిమితిలోనే యితరుల భావోద్రేకాలను

అర్థం చేసుకో గలరు. రచయితకు సంబంధంలేని మరేదో మనోభావం రచయిత మనస్తత్వ నిర్మాణానికి భిన్నమైన భావం, సహజంగానే అతని దృష్టినుండి తప్పించుకు పోతుంది. ఒకవేళ అతడు చిత్రించినా, యితర గ్రంథాలలో అది ఎట్లా వర్ణింప బడిందో అతడు గుర్తుతెచ్చుకోవాలి. లేదా యుక్తియుక్తమైన ఊజాయింపులతో అతడు సంతృప్తిపడాలి. ఇలాంటి పుస్తకాలుగాని, ఇలాంటి వర్ణనలుగల నవలలో కొన్ని భాగాలుకాని పేలవంగా అభిప్రాయ వ్యక్తీకరణ లేకుండా వుంటాయి.

పాశ్చాత్య దేశాలలో ప్రబలియున్న అభిప్రాయానికి భిన్నంగా రచయిత జీవితనాటకం యొక్క, కామెడీ యొక్క ప్రేక్షకుడుగా ఉండజాలడు. అతడా జీవితనాటకంలో పాత్ర వహించితీరాలి. ఒక నవల ప్రథమాధ్యాయం ప్రారంభించే ముందు, నెలలకొలది, సంవత్సరాలకొలది సన్నాహం చేయాలి. నోట్సు మొదటి ప్లానులు వగైరా సిద్ధంచేసుకోవాలి.ఇతర ప్రజలతో కలిసి గాఢంగా జీవించడం, వారి సుఖదుఃఖాలలో పాల్గొనడం, ఉత్సాహ నిరుత్సాహాలలో భాగస్వామికావడం, యితర ప్రజలతో సన్నిహిత సంబంధం మొదలైనవి వుండాలి.

ఇలా చెప్పడంలో రచయిత తాను అనుభవించింది మాత్రమే చిత్రించుతాడని నా అభిప్రాయం కాదు. రచయిత తాను అనుభవించిన దానినేగాక, పరిశీలించిన దానిని కూడా మార్చుతాడు. అయినా, ప్రజల ఆలోచనను, భావోద్రేకాలను తాను అర్థం చేసుకోగలడో ఆ ప్రజలనే రచయిత యెప్పుడూ వర్ణించుతాడు. తన రచనలోని పాత్రలు యెలా నడుస్తాయో అర్థంచేసుకోడానికి ఆ పాత్రల స్వభావాన్ని తనకు వెల్లడించే అనుభవాన్ని రచయిత పొందాలి.

రణరంగంలో కందకాలలో ఉండి, పీనుగు పెంటలలో ఉండి, పాశ్చాత్య రచయితలు మొదటి ప్రపంచయుద్ధాన్ని వర్ణించారు. అంతేగాని తమ అధ్యయనగృహాల నుండి వ్రాయలేదు. బార్బూస్, రెమార్క్యూ, రెన్, డార్జెల్స్, హెమింగ్వే, ఆల్డింగ్టన్ మొదలైన రచయితలంతా ఈ కోవకు చెందినవారే. బుద్ధిమాలిన హత్యాకాండకు క్రోధావేశులయిన దేశాల అంతరాత్మను, విషాదకరమైన విచిత్రాంశాలతో కూడిన తమ నవలలో వీరు చిత్రించారు. నెక్రసోవ్, కజకెవిచ్, బెక్, సిమనోవ్, గ్రాస్మన్, పనోవా మొదలైన సోవియట్ రచయితలు తమ రచనల్లో రెండవ ప్రపంచ యుద్ధాన్ని బాగా చిత్రించారు. వీరంతా యుద్ధంలో పాల్గొన్నవారే.

"యుద్ధమూ, శాంతి" (War & Peace) చారిత్రక నవల. టాల్‌స్టాయ్ తాను పుట్టకముందు జరిగిన ఘటనల గురించి యిందులో వర్ణించాడు. ఆ ఘటనల గురించి ఆయన పాత చారిత్రక పత్రాలను పరిశీలించవలసి వచ్చింది. వాటిలో

గత యుద్ధాన్ని గురించిన రిపోర్టులను ఆయన తెలుసుకోగలిగాడు. కాని ఆ యుద్ధాలో పాల్గొన్న సైనికులు, ఉద్యోగులు ఆ యుద్ధం గురించి, ఏమను కొన్నారో తెలియచేసే రిపోర్టులు వాటిలో లేవు. సెవాస్తపూల్ రక్షణలో టాల్‌స్టాయ్ పాల్గొన్నాడు. క్రిమియా యుద్ధం 1812 నాటి యుద్ధం వంటిది కాదని వేరే చెప్పనక్కరలేదు. టాల్‌స్టాయ్ తన అనుభవాలను, పరిశీలనలను యీ నవలలోకి యాంత్రికంగా అనువర్తింపచేయలేదు. కాని సెవాస్తపూల్ రక్షణలో టాల్‌స్టాయ్ పాల్గొనడం "యుద్ధమూ, శాంతీ" అనే అతని నవలలోని పాత్రలను అర్థంచేసుకోడానికి ఆయనకు ఉపయోగపడింది.యుద్ధంలో యెప్పుడూ పాల్గొనని వ్యక్తి, సైనికుని జీవితాలను, అతడు యెలా భయాన్ని జయిస్తాడో, యెప్పుడూ నోరుతెరచుకొనివున్న మృత్యుదేవునితోపాటు అతడెలా జీవించుతాడో, స్నేహాలు యెలా పెంపొందుతాయో, ఒక ప్రక్క మొరటుతనం, మరొక ప్రక్క ప్రతి దానికీ బాధపడే ఆర్ద్ర హృదయం వొకేసారి మానవులలో యెలా వుంటుందో, అర్థంచేసుకోలేడు. ప్రజలను వర్ణించడానికి ముందు వారి హృదయ కవాటాలకు తాళం నీవద్ద వుండాలి. ఇతరుల అనుభవాలను తానను భవించగల శక్తి అని అనవచ్చు.

ప్రతిభావంతమై కళ్ళకుగట్టే మొదటి పుస్తకం వెలువడగానే ఒక యువ రచయిత తార శాశ్వతంగా రాలిపోయిన ఉదాహరణలు మనం చాలా చూశాము. కొన్ని సందర్భాలలో రెండవ పుస్తకమే వెలువడదు. మరికొన్ని సందర్భాలలో ఆ రచయితల రెండవ, మూడవ పుస్తకాలు కూడా వెలువడుతాయి. కాని పాఠకులు ఆ రచనలను చూచిన తర్వాత వారికున్న భ్రమలు కాస్తా పోతాయి. సాధారణంగా అలాంటి విషాద సంఘటన జీవిత చరిత్రతో సంబంధించి వుంటుంది.

ఇంజనీర్‌గానో, భూగర్భ శాస్త్రజ్ఞుడుగానో, కార్మికుడుగానో,విద్యార్థిగానో జీవితంలో ఉత్సాహవంతమైన పాత్ర వహించిన యువకునికి కొంత అనుభవం వుంటుంది. ఏదో కొంత చూసివుంటాడు. అతనికే కొంత చాతుర్యం వుంటే, తన అనుభవాన్ని తన రచనలో ఉపయోగించి విజయం పొందుతాడు. అతడు రచన వృత్తిగా సాగించడం మొదలు పెట్టగానే, తానిదివరలో సాగించిన జీవితానికి దూరమైపోతాడు తాజా పరిశీలనల అనుభవవేగం ఆగిపోతుంది. అతని రెండవ లేక మూడవ రచనలు ఎందుకు విఫలం చెందుతాయంటే, అవి అనుభవం మీద ఆధారపడి రచించినవి కావు; సాహిత్య అనుభవాలు స్మరణలూ, రెడీమేడ్ పథకాలూ, ఉజ్జాయింపులతోను కూడుకొని వుంటాయి.

గత కాలంలోని రచయితల జీవిత మార్గాలు యెంత క్లిష్టమైనవో, ఎంత కంటకావృతమైనవో జ్ఞాపకం వుంచుకోండి. అనేక నగరాలలో సాల్టికోవ్

షెడ్రిన్ సివిల్ సర్వీసులో ఉద్యోగాలు చేశాడు. దోస్తవస్కీ కఠిన శిక్ష అనుభవించాడు. గోర్కీ "విశ్వవిద్యాలయాలు" అనే గ్రంథంలో తెల్పిన జీవిత యాత్రను చూడండి. కోరొలెంకో ప్రవాసం "చెప్పులు కుట్టేవాడు, చిత్రకారుడు" గమనించండి. ఈ రచయిత లంతా ప్రతిఒక్కరూ ఒక డజన్ గ్రంధాలు రాయగల భావనా సంపత్తును అనుభవంలో సంపాదించి, సాహితీరంగంలో ప్రవేశించారు.

"డేవిడ్ కాపర్‌ఫీల్డు", "ఆలివర్ ట్విస్ట్", "లిటిల్ డారిట్" అనే గ్రంధాలను రాసే ముందు డికెన్సు బాల్య జీవితంలో చాలా కష్టాలుపడ్డాడు. చేదు జీవితం రుచి చూశాడు. తోళ్ళకు నల్ల రంగువేసే ఫ్యాకరీలో కూడా పని చేశాడు. బాల్జాక్ ఒక నోటరీ (దస్తా వేజులు మొదలైనవి ధృవీకరించే అధికారి) ఆఫీసులో పనిచేశాడు. కృతకృత్యుడు కాలేకపోయినా, చిన్న చిన్న వ్యాపార లావాదేవీలలో పాల్గొన్నాడు. ఫ్రెంచి, బూర్జువా వర్గపు గాడావేశాల్ని అనుభవించి, వాటిని ఆ తర్వాత తన రచనల్లో ఉపయోగించుకున్నాడు. పెట్టుబడిదారీ ప్రపంచంలో రచన ద్వారా పొట్టబోసుకోవడం చాలా కష్టమైన పని. రచనయే వృత్తిగాగల గ్రంథకర్తలుగా అయే ముందు యూరప్‌లోని, అమెరికాలోని సుప్రసిద్ధ రచయితలు చాలామంది, అంతకు పూర్వం కార్మికులుగా, పోస్టు జవానులుగా, పడవ కూలీలుగా, వీధి ఫోటోగ్రాఫర్లుగా, మంగలి వాళ్ళుగా, బంగారం సంపాదించాలని అన్వేషణకు బయదేరినవాళ్ళుగా పనిచేశారు. వారికి చాలామంది ప్రజలతో సంబంధం ఏర్పడింది. వారెన్నో కఠిన పరీక్షలకు లోనయ్యారు. పెట్టుబడిదారీ సమాజంలోని అధమావస్థను గురించి నవలలు రాయడంలో వారి కా జీవితం ఎంతో తోడ్పడింది.

"పట్టణాలు - సంవత్సరాలు" (Cities and years) అనే గ్రంథాన్ని తాను మొదటి ప్రపంచయుద్ధంలో జర్మనీలో యుద్ధఖైదీగా ఉన్నందున ఫెడిన్ రాశాడు. అతని ఆఖరి రెండు నవలలు అతని యౌవనకాలానికి సంబంధించినవి. "దళం" (The Ninteen) అనే గ్రంథం రాసేముందు ఫెదయెవ్ సోవియట్ దూరప్రాచ్యంలో గెరిల్లాయోధుడు. అంతర్యుద్ధాన్ని గురించి రాసిన కథలలో, వ్సెవొలోద్ ఇవనోవ్, అంతర్యుద్ధంలోని తన అనుభవాలను వర్ణించాడు. అలెక్సీటాల్ స్టాయ్ త్రికగ్రంథం (Trilogy) లో ఎక్కువ భాగం ఆత్మకథయే. "తెల్ల తెరచాప మెరుస్తోంది" (A White Sail Gleames) అనే నవలలో, తన బాల్యదశలోని దృశ్యాలను వర్ణించుతాడు. పావ్లెంకో "సౌఖ్యం" (Happiness) అనే నవలా ప్రారంభం అంతసులభంగా చేయలేదు. దానిని రాసేముందు అతడు స్వయంగా అనుభవించిన ఘటనలు ఎన్నో ఉన్నాయి.

ఒక నవల అచ్చయినతర్వాత దానికి వచ్చే ఆదరణను పరిశీలించితే, "ఇతరుల అనుభవాన్ని రచయిత అనుభవించడం" అని నేను దేనిని అంటున్నానో ఆ విలక్షణ స్వభావాల్ని గ్రహించడం సులభం. అనగా పాత్రలను ఎన్నుకోడం అనే విలక్షణ స్వభావాన్ని గ్రహించడం సులభం. కొన్ని కొన్ని పాత్రలను, ఒక్కొక్క పాఠకుడు బాగా మెచ్చుకుంటాడు. ఒక నవలలోని పాత్రల విషయమై తమవైఖరిలో విభేదం రావడంవల్ల తరచు పాఠకుల్లో తీవ్ర వాగ్వివాదాలు జరుగుతాయి. నేను చెప్పేది సిద్ధాంతవిభేదాల విషయం కాదు. పాత్రల అవగాహన విషయంలో వచ్చే విభేదాలనే. స్టెంథాల్ రాసిన గ్రంథం "Le Rouge et le Noir" (లారోగ్ లా నోయిర్) వెలువడగానే, కొందరు పాఠకులు జూలియన్ సొరెల్‌ను స్వచ్ఛమైన ఉన్నతమైన రొమాంటిక్ వ్యక్తి అన్నారు. ఇతరులు అతనిని ఉన్నతపదవులకు ఎగబ్రాకడానికి తంటాలు పడేవాడనీ, కటికిగుండె వాడనీ స్వార్థపరుడనీ, నీచుడనీ, అన్నారు. పనోవా రాసిన నవల "కృజలిఖా" పై ఇటీవలనే జరిగిన చర్చను మరచిపోలేం. లిస్టోపాడ్ పాత్రను, చర్యలను పాఠకులు విభిన్న దృక్కోణాలనుండి చూశారు. నా నవల విషయంకూడా చెప్ప నీయండి. "The Storm" (తుఫాను) లోని సెర్జీ వ్లాఖోవ్ పాత్ర కొందరికి అనుకరించతగినదిగా కన్పడింది. మరికొందరిని మనోదారుఢ్యం లేని, స్వార్థపరతతో కూడినదిగా కన్పడింది.

చదవడం ఒక సృజనాక్రమం. ఒక నవలను చదివినపుడు పాఠకుడు రచయితకు సంబధించిన కృషికి తోడుగా మరికొంత పని చేస్తాడు. కథలోని ఖాళీలను తన ఊహలతో నింపుతాడు. తనకున్న అనుభవం పురస్కరించుకొని సహజంగా పాఠకుడు ఈ పని చేస్తాడు. ఒక నవలలోని పాత్రలను విభిన్న పాఠకులు విభిన్న విధాలుగా అవలోకించుతారు. పాఠకుని ఊహననుసరించి ఆ పాత్రలను పైకెత్తడమో, దిగజార్చడమోచేస్తారు. లేదా రంగుపులుముతారు. లేదా రంగు మార్చుతారు. పాఠకుల సమావేశంలో తరచుగా నా నవలలోని సాహిత్య లోపాలను వారు ఎత్తిచూపినపుడు అప్రయత్నంగానే సాహితీపరమైన నా అనేక లోపాల గురించి మాత్రమే గాక మానవత్వ స్వభావంలోని అనేక విభేదాల గురించికూడా తెలుసుకొని నేను ఆశ్చర్యపోయేవాణ్ణి. పాఠకుడు ఒక పాత్రను హృదయానికి దగ్గరగా మార్గం కనుగొంటాడు మరోపాత్రను నిర్ల క్ష్యంగా చూస్తూ దాటిపోతాడు.

ఇలాంటిది రచయితలకు కూడా సంభవించుతుంది. వారు ఒక విష యాన్ని గమనించుతారు. మరోదాన్ని నిర్లక్ష్యంచేస్తూ పరికించరు. బద్ధకస్తు లవడంవల్లనో, మతిమరపువల్లనో ఈ పని చేయడంలేదు వారు. వారి జీవితం లోనే, వారి స్వభావంలోనే గల ప్రత్యేక లక్షణాలివి. ప్రతి రచయితకూ

కొందరి హృదయాలలోకి చొచ్చుకుపోగలడానికి మార్గమది. కాని మరికొందరిని అర్థంచేసుకోలేడు. ఒకవేళ అర్థంచేసుకొన్నా చాలా తక్కువగానే అర్థం చేసుకోగలడు.

ప్రతి రచయితకు హృదయ కవాటాలను తెరవడానికి బీగాలుంటాయి. కాని కొందరికి ఇతరులకన్నా ఎక్కువ హృదయ కవాటాలు తెరవగల బీగాలున్నాయి. కాని అందరి హృదయాల కవాటాలను తెరచగల బీగాలు ఏ రచయిత వద్దా లేవు.

రచయిత ఒకే రకమైన పాత్రలను తన రచనలో చుట్టూ చేర్చడం, మనకు తెలిసిన విషయమే. ఉదాహరణకు పూర్వ సాహిత్యాన్ని తీసుకోండి. "తుర్గెనెవ్ కన్యలు", "చెకోవ్ పాత్రలు" ఇలాంటి నిర్వచనాలు మనం చూస్తూనే వుంటాం. ఈ నమూనాలు ఆ దశకు మాత్రమే సంబంధించినవికావు; రచయితల ప్రత్యేక స్వభావాలు వారు ఎన్నుకొన్న ఈ నమూనాలలో వున్నాయి. తుర్గెనెవ్‌కాలంలో శక్తివంతమైన అధికారప్రియ స్త్రీలు లేరా? స్వార్థపరత్వంతో కూడిన క్షుద్ర ఇంద్రియ సుఖపరాయణతలకు సంబంధించిన ఘటనలు లేవా? తుర్గెనెవ్ శక్తివంతమైన అధికారప్రియ స్త్రీలను చిత్రించాడు, ఐతే దూరాన్నుండి సుఖప్రదమైన ప్రేమను చూపించాడు. కాని, ప్రత్యేకశక్తితో, ప్రత్యేక గాఢావలోకనతో "తుర్గెనెవ్ కన్య"లనబడే కథానాయికలను ఆయన చిత్రించాడు. గెథే, షెల్లింగ్‌ల పట్ల ఆయన ప్రేమ, సాహిత్యం లేక తాత్విక ఉత్సాహం వీటితో దీనిని విశదీకరించలేము.

శిథిలమయిపోతున్న పెద్ద మనుష్యులను అనావశ్యకమైన ప్రజలను చిత్రించాలంటే తుర్గెనెవ్‌కు పతనం పొందే కన్యల రూపాలూ పరిశుద్ధ కన్యల రూపాలూ అవసరమే. అయితే తుర్గెనెవ్ ఆత్మిక అనుభవాలను (Spiritual experiences) గురించి మనం ఆలోచించకుండా వుండలేము. వాస్తవిక జీవితంలో నిస్సందేహంగా తుర్గెనెవ్ తను సృష్టించిన పాత్రలలో కొద్ది మందిని కలుసుకున్నాడు. కాని ఆయన పాత్రా స్వంత జీవితమూ, "తుర్గెనెవ్ కన్యల" లోని ఒక పాత్ర లక్ష్యాన్ని, స్వభావాన్ని తరచుగా మనకు జ్ఞాపకం చేస్తుంటాయి. చెకోవ్ కాలంలో రష్యాలో దిట్టమైన విప్లవకారులున్నారు. వారు మేధావంతులేగాక, ఉక్కులాంటి మనోధార్ఢ్యం కలవారు, అయినా చెకోవ్ భగ్న జీవులను, అస్పష్టమైన కలలుగనే వారిని జీవితం యొక్క మొరటు తనానికీ, రసహీనతకూ గురియై అణగిపోయిన, చైతన్యవంతులయిన స్త్రీ పురుషులను గురించే రాశాడు.

చెకోవ్ ఉత్తరాలను చూచినా, అతని సమకాలీనుల స్మృతులను చూచినా చెకోవ్ అతిమెత్తని మనిషి అనీ విచారగ్రస్తుడు అనీ బోధపడుతుంది. బిగ్గరగా

గొంతు చించుకొనేవాళ్ళను సహించలేదనీ తనచుట్టూవున్న నాటకీయ పరిస్థితులను తప్పుకు తిరిగేవాడనీ, వ్యక్తుల బలహీనతలను, విఫలతలను క్షమించే వాడనీ తెలుస్తుంది. సాహిత్యంలో కూడా అలాంటి వ్యక్తిగానే చెకోవ్ నిలబడి పోయాడు. తన పాత్రలను ఎన్నుకోవడంలోను, తన పాత్రల చిత్రణలోను చెకోవ్‌ను నడిపించినది పైన చెప్పిన ఆ ధోరణే. యువకుడుగా వున్నప్పుడు రాసిన "బీదజనం" (Poor Folks) మొదలుకొని "కారమజోవ్ సోదరులు" అనే పుస్తకం వరకూ, డాస్టవస్కీ, స్త్రీ ఆంతరంగిక ప్రపంచాన్ని గురించి గాఢమైన చిత్రీకరణను ఎన్నడూ చేయనేలేదు. అతని రచనలలోని స్త్రీలు మృత్యువును రుచిచూసే స్వభావంకలవారు. అతని కథానాయకుల భవిష్యత్తును మార్చడానికి మాత్రమే ఆ స్త్రీలు కనపడతారు. అతని నవలలో పరస్పర ప్రేమగాని, నైతిక ఆధ్యాత్మిక సన్నిహితత్వంగాని వుండదు. అతని స్వభావంతో, అతని భావోద్రేకాలతో అతని ఒంటరితనంతో, అతని కష్టభూయిష్టమైన యావజ్జీవితంతో, ఇది సంబంధించి ఉంది.

ఏ కారణంచేతనైనా గానీండి, రచయిత తనకు తెలియని ప్రజలనుగాని, తను అర్థంచేసుకోలేని ప్రజలనుగాని చిత్రించితే, తప్పకుండా ఆ రచన విఫలమై తీరుతుంది. చెకోవ్, చివరి రోజుల్లో ఒక విప్లవ యువతిని గురించి రాయడానికి సంకల్పించాడు.

ది ఫియాసా (The Fiancee) అన్న ఆ కథ చదివాక వెరెసాయెవ్ ఇలా అన్నాడు: "ఆంటన్ పావ్లోవిచ్ !. (చెకోవ్!) విప్లవంలోకి యువతులు చేరే మార్గం అదికాదు. ఇంతేగాక, నీవు వర్ణించిన "నాద్యా"లాంటి యువతులు అసలు విప్లవంలోనే చేరరు". చెకోవ్ తన తప్పు గ్రహించి కథను తిరిగి రాశాడు. అయితే కథానాయిక పాత్రను అతడు మార్చలేదు. కథను మార్చాడు. ప్రచురింపబడిన కథలో నాద్యా విప్లవంలో చేరదు. చెకోవ్ వ్రాసిన ఇతర కథానాయికల వలెనే నాద్యా సుఖమయ జీవనంకోసమై అస్పష్టమైన స్వప్నాలు కంటూ వుంటుంది, తన కాలంలోని ఒక విప్లవకారుని గురించి డాస్టవస్కీ చిత్రించదలచాడు. కాని, అది అసంబద్ధమైన వ్యంగ్య చిత్రంగా తయారయింది. ఎందువలనంటే (The Demons) "ది డెమన్స్"లో చిత్రించిన జీవితాన్ని డాస్టవస్కీ ద్వేషించడమేగాక, ఆ జీవితాన్ని అతడు అర్థం చేసుకోలేదు, అతనికి తెలియనూ తెలియదు.

"డెడ్ సోల్స్" (Dead Souls) లోని రెండవ భాగంలో గొగోల్ వర్ణించిన ప్రజలు వాస్తవికంగా లేరు. వుండరు. దాసత్వాన్ని (Serfdom) ఒక్క ఉదారంగా ప్రబోధించే వారనీ, ఘన బుద్ధిగల కౌలుకిచ్చే ఆసాములనూ వర్ణించదలిచాడు. ఆ కథనం ఎలా ముగిసిందీ అందరికీ తెలిసిందే.

ఒకానొక రకమైన వాతావరణాన్ని సృష్టించలేదనో, కొన్ని రకాల పాత్రలను సృష్టించలేదనో రచయితలను కొందరు విమర్శించుతూ వుంటారు. ఒకానొక నవలపై ఏండ్లకొలది కాలాన్ని వినియోగించిన రచయితకు, సమీక్షకుని, మనస్సులో హఠాత్తుగా పుట్టిన ఆ అభిప్రాయం తట్టలేదని అనుకో గలమా? కొన్ని రకాల థీమ్ 'కథా వస్తువు'గాని, కొన్ని రకాల పాత్రలుగాని ఒక నవలలో లేవంటే దాని అర్థం ఆ నవలా రచయిత మతిమరపు అని నా అభి ప్రాయంకాదు, లేక అతడు చాలా త్వరగా తొందరపడి రాశాడనీ కాదు. లేక అతడు రాజకీయంగా అజ్ఞాని అనీ కాదు. కాని నేనిదివరలో ఉదహరించిన పరిమితులే వాటికి కారణం.

బూర్జువా వ్యక్తిత్వవాద ప్రచారకులు చెప్పే రీతిగా సోషలిస్టు సమాజం వ్యక్తిత్వాన్ని నాశనం చేయదు. "పైగా వికసింపజేయడానికే ఉపయోగపడు తుంది. స్వంత చొరవ" ఆరాధన వికసించే అమెరికాలో, పెట్టుబడిదారీ ఆర్థిక విధానాన్ని ఒక మతంగా తయారుచేసిన ఆ దేశంలో, ఆధ్యాత్మిక వాదాన్ని ఒకే కొలబద్దతో కొలవడం రోజురోజుకూ ఎక్కువవుతోంది. సోవియట్ యూని యన్‌లో అలా గాదు. ఒకే ఆదర్శంతో ఐక్యమైన సోవియట్ స్త్రీ పురుషులు, ఒకరని పోలి మరొకరు ఉండవలసిన అవసరంలేదు. ప్రతివారూ తన ప్రత్యే కతను (Particular make up) కలిగి వుంటారు. ప్రతిదానినీ, ప్రతివారినీ వర్ణించవలసిందని రచయితను ఎవరైనా అడగవచ్చునా? ఎందుకు మనం అలా అడగాలి? మాకు అనేకమంది రచయితలున్నారు. ఒకరు వర్ణించలేని దానిని మరొకరు వర్ణిస్తారు. "చూడండి! అతను ఫలాన్ని వర్ణించలేదు"అని విమర్శకులు అనకుండా వుండేందుకు గాను కొందరు రచయితలు నిర్లక్ష్యంగా, నిరుత్సాహ పూరితంగా కొన్ని పేజీలను తమ కథలతో నింపుతారు. అంతకన్నా జాలి కల్గించే నిరుత్సాహకరమైన విషయం మరొకటి లేదు.

# 8

ఒక ప్రముఖ రచయితను "మీ రచనలోని కథానాయకుని అసలు పేరేమిటి? ఎవరినో మనస్సులో పెట్టుకొని మారు పేరుతో మీరు రాస్తున్నారు గదా. అందుచే అసలా వ్యక్తి ఎవరు?" అని రచయితను ఒక్కొక్కప్పుడు అడుగుతూ వుంటారు. నిజంగా ఉన్న వ్యక్తులనే, తానెరిగిన ప్రజలనే రచయితలు వర్ణించుతారని కొంతమంది పాఠకులు తలుస్తారు. వాస్తవంగా ఉన్న ప్రజలను రచయిత తన నవలలో చాలా అరుదుగా చొప్పించుతాడు. ఒకవేళ చొప్పించినా ఆ వ్యక్తుల్ని మార్చుతాడు.

ఒక్క అక్షరం మార్చడంద్వారానే పోలివాయ్ తన పేరు ఉచ్చారణను మార్చడమేగాక, ఆ పాత్రకు విభిన్న లక్షణాలను కూడా సమకూర్చాడని

మారెసీవ్‌ను కలుసుకొన్నాక నేను తెలుసుకోగల్గాను. చారిత్రక నవలలో నిజమైన పేర్లతోనే వ్యక్తుల్ని చొప్పించినప్పుడుకూడా, వారి పాత్రను తాను అర్థం చేసుకొన్న విధంగా, వారి చర్యలకు తాను భాష్యం చెప్పేరీతిగా రచయిత కొన్ని లక్షణాలను ఊహించి వాటిని ఆ పాత్రలకు ఆపాదించుతాడు. అలెగ్జీ టాల్‌స్టాయ్ "పీటర్ ది గ్రేట్" అనే నవలను రాసే చాలా కాలానికి ముందే "పీటర్ దినచర్య" అనే కథ రాశాడు. రచయిత మారాడు. కాబట్టి అతని కథానాయకునిలో కూడా మార్పులు వచ్చాయి. "యంగ్ గార్డ్" అనే నవల వాస్తవిక గాథపై అధార పడింది. కాని రచయిత ఈ కథలో చాలా మార్పు చేశాడు.

కళాకారుడు బానిసలాగా ప్రకృతిని కాపీ చేయడు. ప్రకృతిని మార్చి, నూతన రూపాలను సృష్టిస్తాడు. అవి వాస్తవికంగా తయారవుతాయి.

ఉదాహరణకు ప్రేమించుకున్న దంపతులిద్దరు మాట్లాడుకొనే సంభాషణలను ఎవరన్నా సంక్షిప్త లేఖిని ద్వారా యథాతథంగా రాస్తారనుకోండి. ఒక మహారచయిత అదేసంభాషణను రాశాడనుకోండి. వాస్తవానికి అంటిపెట్టుకొనే అతడు పై సంభాషణలను చిత్రిస్తాడు. కొన్ని విషయాల్ని వదిలివేస్తాడు. మరి కొన్నిటిని అటూఇటూ మారుస్తాడు. ఇంతేగాక ఆ ప్రేమికులు మనస్సులో అనుకొన్న విషయాలను, వారు బయటికి చెప్పలేకపోయిన వాటినీ కూడా చేరుస్తాడు. అపుడు ఆ రచయిత రాసిన సంభాషణలతో పై సంక్షిప్త లేఖిని సంభాషణలను పోల్చితే అవి చాలా కృత్రిమంగాను, ప్రాముఖ్యం లేకుండాను వుంటాయి. రంగుల ఫోటోగ్రఫీ (ఫోటోగ్రఫీలాగా కన్పడే చిత్రకారునిలో బొమ్మలాగానే) అసలువ్యక్తి చిత్రం వక్రంగా ప్రతిబింబించుతుంది. ఎందువల్లనంటే అతని బాహ్యరూపాలను లేక అనిశ్చిత భావప్రకటనను మాత్రమే వెలిబుచ్చగలుగుతుంది. నిజమైన కళాకారుడు ఆ వ్యక్తియొక్క అసలు వ్యక్తిత్వాన్ని బయలు పెట్టే సింథసిస్ (సంయోగం) తయారుచేస్తాడు.

పాత్రలను సృష్టించడంలో రచయిత పాళ్లను మార్చుతాడు, Perspective ని మారుస్తాడు.

ఫ్రెంచి చిత్రకారుడు మాటిస్సే నాకొకసారి ఒక ఆఫ్రికా వాస్తవ్యుడు చెక్కిన దంతపు ఏనుగులను రెండింటిని చూపించాడు. —చిత్రంలో, ప్రత్యేకించి ప్రకృతి చిత్రంలో ప్రాముఖ్యమైంది దృష్టిక్రమం "Perspective. వస్తువులు దూరంపోయినకొద్దీ ఏవిధంగా కనుపిస్తవో, వాటి వర్ణం ఏమవుతుందో, మొదలైన ఆభాసను చూపేది దృష్టిక్రమం." అని సుప్రసిద్ధ రచయిత చిత్రకారుడు సంజీవ్‌దేవ్ ఒకసారి నిర్వచించారు. అందులో (ఒకచోటునుండి చూసినపుడు ఘన పరిమాణంగల వస్తువుల పరిమాణం, నడిమి దూరం సహజంగా కన్పించేటట్లు సమతలంపై చిత్రించేకళ) ని ఒకటి నాకు బాగా నచ్చింది

"ఇందులో విచిత్రమైన అంశం ఏమీ కనపడటంలేదా?" అని మాటిస్సే అడిగాడు. లేదన్నాను. నాకు నచ్చిన ఏనుగును చూపించి, అది తొండంతో పాటు దంతాలను కూడా పైకెత్తి వుండటం గమనించమని చెప్పాడు. అదే ఆ బొమ్మలో మంచి భావ ప్రకటనకు కారణం. మాటిస్సే నవ్వుతూ ఇలా అన్నాడు: "ఎవడో బుద్ధిహీనుడు ఆ నీగ్రోతో 'దంతాలు పైకి తిరిగి వుండవు, అని అన్నాడట. ఆ నీగ్రో ఆమాటవిని రెండవ ఏనుగును తయారు చేశాడు." అంటూ దానిని చూపించాడు. దాని తంతాలు మమూలుగానే వున్నాయి. కాని అందులో కళ లేదు" అని అన్నాడు

యుద్ధ భీభత్సాలను గురించి "గోయా" చిత్రించినపుడు, అతడు శరీర నిర్మాణ శాస్త్రాన్ని (అనాటమీ) లెక్కచేయలేదు. కాని, 150 ఏండ్ల తర్వాత కూడా అతడు చిత్రించిన గాఢమైన వాస్తవికతను చూచి మనం ఆశ్చర్యపోతాం.

అన్ని దేశాలలోని అన్ని దశలలోని అకాడమీ చిత్రకారులు రాసిన యుద్ధ చిత్రాలకంటె, గోయా చిత్రించిన యుద్ధం వాస్తవికతకు దగ్గరగా వుంటుంది.

సాధారణంగా ఒక నవలలోని పాత్ర అనేక వ్యక్తుల మేళవం. అనేక మంది ప్రజలను అనేకసార్లు కలుసుకొన్నాక అవి సృష్టించబడతాయి. ఆ పాత్రలలో రచయిత తన యావజ్జీవిత అనుభవాన్ని చొప్పించుతాడు. తన నవలలో లేక కథలలో, అందరికి తెలిసిన ఘటనలను రచయిత మార్పు చేశాడనీ, తమ మాటలను తీసుకువెళ్ళి మరొకరినోట చెప్పించాడనీ; ఒక పాత స్నేహితుని బహిరాకృతిని పూర్తిగా వేరు జీవితంగల మరోవ్యక్తికి అమర్చాడనీ -రచయితల సన్నిహిత మిత్రులు ఆశ్చర్యపోతూ వుంటారు.

ఆధునిక రచయితయొక్క మానసిక ప్రయోగశాలలను అర్థం చేసుకోవడం కష్టమైనపని. మనప్రక్కనే రచయిత నివసించుతున్నా, అతని నడవడితోను, జీవితంతోను మనకు తగిన పరిచయంవుండదు. ప్రామాణికమైన (క్లాసిక్స్) పాత్రలు ఎలా ఉద్భవించాయన్న రహస్యాన్ని తెల్సుకోవాలంటే, మనం ఆ రచయిత ఉత్తరాలను తిరగవేయాలి. అతని డైరీలను, నోట్ బుక్కులను పరిశీలించాలి. ఆ రచయిత సమకాలీనుల జ్ఞాపకాలను అవలోకించాలి తనకు నచ్చిన ఒక ప్రత్యేకవ్యక్తిని ఆధారం చేసుకొని ఆ నవలలోని పాత్ర సృష్టింపబడలేదనీ, అనేకమంది ప్రజల వ్యక్తిత్వాలను గురించి బాగా ఆలోచించాక రచయిత ఆ పాత్రను సృష్టించాడని అపుడు మనం గ్రహిస్తాం.

ఒక ప్రముఖ న్యాయాధికారి టాల్‌స్టాయ్‌ను ఆకర్షించిన ఒక కేసును వర్ణించి చెప్పాడు. "పునరుజ్జీవనం" (Resurrection) అనే నవల ఆవిధంగా పుట్టిందని చెబుతారు.

ఈ నవలలో లేవనెత్తిన సమస్యలు టాల్‌స్టాయ్‌ని యావజ్జీవితమూ వేధించాయని మనకు తెలుసు. ఈ ఉద్యోగి చెప్పిన కథ వివరాలు టాల్‌స్టాయ్ తన నవల కల్పన (ప్లాట్) అంతిమరూపం దిద్దడానికి సహాయపడింది. ఈ నవలలోని ఇతివృత్తం ఎపుడో చాలకాలంక్రితమే పుట్టింది. (టాల్‌స్టాయ్ కల్పనలనుకూడా మార్చాడు. అయితే అది ఏవిధంగానూ ఆ ఉద్యోగి వర్ణించిన కేసుకు పోలికలేదు).

అయితే, ఆ పరిశీలన మామూలు పరిశీలనగాదు. ఇతరులు అనుభవించి, బాష్యీకరించి చెప్పిన విషయాలను స్వయంగా అనుభవించిన దానితో మేళవించిన పరిశీలన అది. నిజంగా నమూనాలనదగిన పాత్రలను, సమాజాన్ని ప్రతిబింబించే నిజమైన పాత్రలను, కళాకారుడైన రచయిత గంభీరంగా వాస్తవికతతో చిత్రించడానికి ఈ పరిశీలన తోడ్పడుతుంది.

నమూనాఅంటే అర్థం లెక్కలూ, అంకెలూ అనికాదు. ఒక నవలలోని పాత్రను పోలినవ్యక్తులు 30 లక్షలమంది వుంటే, నమూనాపాత్రను సృష్టించడంలో రచయిత విజయం పొందాడని, మూడువేలమంది మాత్రమే వుంటే, ఆ రచయిత విఫలుడయ్యాడనీ చెప్పడం అసాధ్యమైన విషయం. రచయిత తన సమాజ జీవితాన్ని అనుభవించుతాడు. జీవిత సమ్మర్దంలో ఏం జరుగుతూవుందో అతడు చూపించుతాడుగాని, అతడు సమాజానికి బయట వుండేజీవితాన్ని చూపించడు. అతడు చలనాత్మక ప్రజలను, జాతులను చూపించుతాడు, "చాట్స్కీ" ని ఉదాహరణగా తీసుకొంటే లెక్కలు, అంకెలతో ఆ పాత్రకు సంబంధం లేదు కాని, రష్యాలోని అభివృద్ధికాముక ముఠాల తీవ్రద్వేషాన్ని, అస్పష్టమైన ఆశలనూ చాట్‌స్కీ పాత్ర వెలిబుచ్చింది. అబ్లొమోవ్ అనేపాత్రను "గోంచరోవ్" సృష్టించాడు. విచిత్రమైన ఉదాహరణ కాబట్టి అబ్లొమోవ్ పాత్రను అతడు సృష్టించలేదు. అలాంటి వ్యక్తులు సామాజిక విషాదాంత చిహ్నాలు కాబట్టే ఆ పాత్రను సృష్టించాడు. అనా కెరినినా ప్రేమను తీసుకొంటే, అంత గాఢ ప్రేమ చాలా అరుదైన విషయం. కాని, అది అందరికీ అర్థమయే విషయం.

మన సమకాలికులైన బూర్జువా రచయితలు ఎందుకు అంత చవిటి వర్రలై పోయారు? జీవితం నుండి దూరంగా వారు పారిపోవడంవల్ల, ఇతరులతో ఎట్టి పోలికా లేని వ్యక్తులను తమ రచనలలో సృష్టించడం వల్ల వారలా తయ్యారయ్యారు. వారు చిత్రించినలాంటి వ్యక్తులు అసలులేరనా? వుంటారు; మనం అను కొన్నదానికంటే ఎక్కువగా కూడా వుండవచ్చు. కాని, వారిని గురించివర్ణన పాఠకుని కదల్చలేదు. కారణం, తనయొక్క, తన కాలంయొక్క ప్రతిబింబాన్ని పాఠకుడు కోరతాడు. స్టెంధాల్ కాలంలో ఫ్రాన్సులో ప్రతి

జంక్షన్ వద్దా జూలీన్ సోరెల్, లూసీన్ లూవన్‌లాంటి వ్యక్తులు తారసిల్లే వారని మనం భావించరాదు. అలాంటి రకాల వ్యక్తులు చాలా అరుదని నాఅభిప్రాయం. ఆ కాలపు గాఢకాంక్షల, అభీష్టాల కేంద్రీకృత రూపాన్ని సూచించేటటు వంటివి ఆ పాత్రలు. ఇప్పుడు కూడా మారిన రూపంతో అవి వున్నాయి. అందు చేతనే స్టెంధాల్ పుస్తకాలను ఇంకా చదువుతున్నారు. బహూశా చాలా కాలం వరకు చదువుతారు కూడా. ఆధునిక బూర్జువా నవలలోని పాత్రలు మానవ గాఢ కాంక్షల సముదాయం కాదు. కుతూహలం కల్గించేదీ. అరుదైన ఆధ్యాత్మిక తత్వాన్ని ప్రదర్శించుతాయి. అవి మైనపుబొమ్మ శాలలో వుండవలసినవి. హోమోసెక్సు యలిస్టునీ, తన బిడ్డను ప్రేమించక మానసికంగా క్రుంగిన స్త్రీనీ, ఏకారణం లేకుండానే ఆత్మహత్య చేసుకొనే వ్యక్తినీ ఈ నవలలు చిత్రించుతున్నాయి.

ఏదో ఆకస్మిక ఘటనా అసాధరణమైనదీ, రచయిత దృష్టిని సాధారణంగా ఆకర్షించవచ్చు కాని, కొంచెం ఆలోచించిన పిదప దానిని గురించి వెంటనేగాని, ఆ తరువాతగాని వ్రాయడు. ఒక మనిషి, లేక ఘటన రచయితను ఆశ్చర్యపరచ వచ్చు. రచయితనేగాక ఇతరులను కూడా ఆశ్చర్య పరచవచ్చు. కాని, మానవతా విలువలు ప్రతిబింబించని ఘటనలు, వ్యక్తులు రచయిత బుర్రలో నిలవబోరు.

ఒక నవలలోని పాత్రలు ఫోటోగ్రాఫ్‌ల సంపుటికాదు. లేక వ్యక్తికి సంబంధించిన శాఖలో ప్రశ్నపరంపరల ఫైలూ కాదు. రచయిత ఊహాచిత్రాలే ఆ వ్యక్తులయినా వారు వాస్తవిక వ్యక్తులే. ఎందుచేతనంటే, జీవితాన్ని లోతుగా చూచి అన్వయించే నైపుణ్యంగల రచయిత ఆ పాత్రలకు జీవంపోస్తాడు.

తను సృష్టించిన పాత్రలతో రచయిత ప్రపంచాన్ని నింపుతాడు. "గ్రిబొయెడొవ్" రాసిన "Wit Works Woe" (నవ్వు నాల్గు విధాలచేటు.) అన్న గ్రంథం రాసేవరకు చాట్స్కి లాంటి వ్యక్తులు రష్యాలో వున్నారా? ఉన్నారు.. అయితే అలాంటి వ్యక్తులున్నారని పూర్తిగావారు గ్రహించలేదు. వారిచుట్టూవున్న ప్రజలు కూడావారిని స్పష్టంగా చూడలేకపోయారు. ఈ గ్రంథం రాశాక, "అడుగో చాట్స్కీ" అనడం పరిపాటి అయిపోయింది. గొగోల్ తన గ్రంథాలలో అనేక తరాలవాళ్లను జీవితాలలోకి అనేక మంది పెద్ద మనుష్యుల్ని విస్తారంగా ప్రవేశ పెట్టాడు. ఈనాటికీ ఖెస్లకావ్‌లాంటి అబద్ధీకుణ్ణి, డాంబికుణ్ణి మనం చూస్తూనే వుంటాం. "మానిలావ్ తత్వాన్ని" బట్టబయలు చేయడం యిప్పుడు చూస్తూనే వుంటాము ("మానిలివ్ తత్వం" అంటే, నిశితయా పరత పగటి కలలు కనడం, నిరర్థమైన, ఆత్మసంతృప్తి, గొగోల్ రాసిన "డెడ్‌సోల్స్"లోని ఒక పాత్ర మానిలోవ్). లిసా, ఆస్యా, జెమ్మా అనే పాత్రలను

నిజంగానే ఊహించి యువకులు ప్రేమించుతారు. గోర్కీ నవల "అమ్మ" మనకు ఒక చారిత్రకవ్యక్తిగా కన్పించుతుంది. ఆమె మనకు కల్పితపాత్రగా గాక, నిజంగా జీవించుతున్న పాత్రలాగా కన్పడుతుంది.

రచయిత కృషిలో చాల కష్టమైనపని పాత్రలను కనడం. ఒక యంత్ర వస్తువులాగా ఆ పాత్రను సృష్టించడం సాధ్యం కాదు. అది చాలా క్లిష్టమైన పరిణామం.

# 9

రచయిత ప్రజలను పరిశీలించినపుడు వారిని గురించి అన్ని విషయాలను చూడలేడు. మానవ హృదయాన్ని అర్థం చేసుకోవడంలో ఎంతో అనుభవంగల విద్యార్థి సైతం కనిపెట్టలేని, నిధిలా దాచుకున్న గుప్త ఆలోచనలు, రహస్య భావాలు వుంటాయి. ఈ ఆలోచనలు, భావాలు ఎంతో ఒత్తిడి ఏర్పడినప్పుడు మాత్రమే బయట పడతాయి. వాటిని అతని సన్నిహితులు అపుడు చూడగల్గుతారు. లేదా బహుశా గ్రహించగల్గుతారు. నవలలోని పాత్రలను సృష్టించేటప్పుడు రచయిత తన పరిశీలనపైనే ఆధారపడటం మాత్రమే గాక తన అనుభవం ఆవేశాలపైన కూడా ఆధారపడతాడు.

ఇబ్సన్‌ది ఎక్కువగా చింతాక్రాంతమైన జీవితం. అతని అసంఖ్యాక నాటకాలు అన్నీ ఆతను సుదీర్ఘంగా తనలో తాను మాట్లాడినట్లు చెప్పిన మాటలనీ ముసలితనంలో ఇబ్సన్ ఈ క్రింది విషయాన్ని అంగీకరించాడు; "కళాకారుడు తనలో కనుగొనగల్గిన నమూనాను మాత్రమే కనీసం కొంత భాగం, కనీసం కొంత కాలం సృష్టించగలడు." దీని అర్థం ఇబ్సన్‌కు నార్వే సమాజం తెలియదనిగాని, అతని రచనలలో అతనొక్కడే ప్రతిబింబించాడనీ, అతని అనుభవాలు మాత్రమే పొందుపరచబడ్డాయనీ కాదు. అతని నాటకాలలో మనం అనేక విభిన్నమైన పాత్రల నమూనాలు చూస్తాం. కాని, రచయిత ముద్ర మాత్రం అన్నింటిపైనా వుంటుంది.

మదాంబొవారీ అనే నవలలో "ఎమ్మాబొవారీ" పాత్రకు ఎవరు మూలం అని అనేక సంవత్సరాలు ఫ్రెంచి పండితులు వాదవివాదాలు కొనసాగించారు. పాతపత్రాలలో రోవెన్ (Roven) పోలీసు రికార్డులన్నీ తిరగా బోర్లా చూశారు. సుమారు పదిమంది కీర్తిశేషులదాకా ఆ పాత్రకు మూలమని భావించబడే వారు దొరికారని నాకు జ్ఞాపకం. ఈ నవలారచయిత ఫ్లాబర్ట్‌ను ఒక చిన్న పత్రికా వార్త ఆకర్షించి వుండవచ్చు. కాని ఏదో మామూలువార్త చదివీ చదవడంతోనే ఈ నవలా రచనకు ప్రారంభించాడని నేను అనుకోను. తన దృష్టిని ఆకర్షించిన అనేక మంది స్త్రీలను అతడు కలుసుకొని మాట్లాడి వుండవచ్చు. తర్వాత చాలా కాలం వరకు అతడు మనసులో పెంచుకొంటూ ఉండి ఉండవచ్చు.

ఇంతేకాదు; మరో విచిత్రమైన సంగతికూడా వుంది. తన స్నేహితునికి రాసిన ఒక ఉత్తరంలో తానొక నవల రాస్తున్నాననీ "అందులో ఎమ్మాపాత్రను నేనే!" అని రాశాడు. ఇది అసంబద్ధంగా మొదట కన్పించవచ్చు. ఫ్లాబర్టు ఏళ్ళువచ్చిన బ్రహ్మచారి. అదోరకంగా విచారం గొలిపే ముఖం. సందేహ మనస్కుడు. అయినా ఉన్నత రసపిపాసి. తుర్గెనెవ్ సైతం ఇతని అభిప్రాయాలకు చెవియొగ్గి వినేవాడు. అలాంటి ఫ్లాబర్ట్‌కూ, నిలకడలేని, నాజూకులేని పల్లెటూరి ప్రేమికురాలి గుణంగల బొవారీకీ సంబంధం యేమిటి? అయినప్పటికీ ఎమ్మా పాత్రలో ఫ్లాబర్ట్ తనను ఎక్కువగా చొప్పించాడు. అతని మరణానంతరం వెలువడ్డ అతని లేఖలలో యిది బయట పడింది (జీవితంలో గాక పోయినా సాహిత్యంలో ఆడంబరత అంటే ఫ్లాబర్ట్ మొగ్గేవాడు. అందుచేత నాజూకుతనం లేకపోవడం అనే దానిని దీనికి వర్తింపచేయ వచ్చు. "సాలంబో" (Salambo) అన్న రచన, బీద మదామ్ బొవారీ కలలకు పూర్తిగా తగినట్లువుంటుంది).

పాఠకుడు ఒక ప్రశ్న అడగవచ్చు. మామూలుగా దుష్ట (నెగెటివ్) పాత్రలని పిలువబడే పాత్రలు ఎలా సృష్టింపబడతాయి? రచయితకు నిశితదృష్టి వుండేచాలునని ఇక్కడ మీ అభిప్రాయమా?-అని పాఠకుడు ప్రశ్నించ వచ్చు. అలాంటి పాత్రలను సృష్టించినపుడు కూడా రచయితకు అతని స్వీయానుభవం సహాయపడుతుందని నేను అనుకొంటాను. తను సృష్టించిన పాత్రల అనుభవాలనన్నిటినీ రచయిత అనుభవించ నవసరంలేదనీ, కాని అలాంటి పోలికల అనుభవం తన పాత్రల అంతరంగిక ప్రపంచాన్ని అర్థం చేసుకోడంలో అతనికి సహాయపడుతుందనీ, నేనిదివరకే చెప్పాను. మోసం, స్వార్థపరత్వం, పిరికితనం మొదలైన దోషగుణాలతో సంపన్నమైన పాత్రలను సృష్టించడానికి రచయిత స్వయంగా మోసగాడు, స్వార్థపరుడు, పిరికిపందా కావలసిన పని లేదు.

నీచమని తాము భావించిన గుణాలను - అవి ప్రారంభంలోవున్నా, బాగాజీర్ణించుకు పోయినవైనా-అతిక్రమించడానికి రచయితలతో సహా ప్రజలంతా కృషిచేస్తారు, సమాజం కూడా కృషిచేస్తుంది. రచయితకు చాలా జ్ఞాపకశక్తి వుంటుంది. తన బాల్యంలో, యుక్త వయస్సు వచ్చేముందు, యుక్తవయస్కుడయ్యాక, తాను అణచుకొన్న చెడుగుణాలు అతనికి జ్ఞాపకం వుంటాయి. వాటినే పెంపొందిస్తే వంచన, పిరికిదనం, స్వార్థపరత్వం మొదలైన గుణాలుగా అవి వృద్ధి చెందేవి. సన్నిహితులలోనో, తనలోనో ఒకప్పుడు గాకపోతే మరొకప్పుడు కన్పడిన దుర్గుణాలను ప్రత్యేకంగా అతడు ద్వేషిస్తాడు, భయాన్ని అతిక్రమించడమే సాధారణంగా ధైర్యం అని అర్థం. కాని, ఎన్నడూ భయమనేదే ఎరుగని అసాధారణమైన స్వభావాలు కలవారుంటారనుకోండి.

రచయితకు అలాంటి స్వభావంవుంటే, అతడు పిరికివాని ప్రవర్తనను వర్ణించుతాడు గాని అతని ఆంతరంగిక పరిస్థితిని వర్ణించలేడు.

వ్యంగ్య రచయిత అతిశయోక్తి అంటే భయపడడు? సాల్తీకోవ్-షెడ్రిన్, "గ్లుపోవ్ పట్టణకథ" కన్న భిన్నమైనధోరణిలో గోలొవ్ల్యోవ్స (Golovlyovs) ను రాశాడు ఖ్లెస్టకావ్ తన అతి దుర్గుణాలతో మనకు వినోదం కల్గించుతాడు లేదా భయపడతాడు. కాని గొగోల్ "ఇనస్పెక్టర్ జనరల్"లో మామూలు మానవోద్రేకాలతో కూడిన ఒక్కశిష్ట (positive) పాత్రనుకూడా ప్రవేశ పెట్టలేకపోయాడు; ప్రవేశ పెట్టలేడుకూడా. ఒక్కొక్కపుడు తప్పుచేసినా, నైతికంగా, చిత్తశుద్ధిగల్గిన ప్రజలను తమ పుస్తకాలలో రచయితలు ప్రవేశ పెట్టడంతోపాటు, పూర్తిగా దుర్మార్గుడైన విలన్ (దుష్టపాత్ర)ను కూడా ప్రవేశ పెడుతూ వుంటారు. ఇలాంటి దుష్టపాత్ర అసంభవంగా పాఠకులకు కన్పడుతుంది. పెన్సిల్ డ్రాయింగ్‌లలో గాని, ఎచింగ్ (ద్రావకంతో ప్లాకులు మొదలైనవి చెక్కడం)లో గాని చిత్రకారుడు తెలుపు, నలుపురంగులను వుపయోగించుతాడు. పూర్తి తెలుపునుగాని, పూర్తి నలుపు రంగునుగాని చిత్రకారుడు వుపయోగించడు. వాటిని ఇతరరంగులతో కలుపుతాడు ఎందువల్లనంటే, నీలిమాకాశం లేక పచ్చనిచెట్ల ప్రక్క నల్లటిరంగును ఉపయోగించితే అది ఒక కంతలా కనపడుతుంది; తెలుపు ఉపయోగించితే ఉబ్బెత్తుగా (High Relief) కన్పించుతుంది. ఒక సమాజ చిత్రాన్ని చిత్రించేటప్పుడు, మంచివారితోపాటు చెడ్డవారిని చిత్రించేటప్పుడు, రచయిత సరైన పళ్ళకోసం ప్రయత్నించుతాడు; అన్ని పాత్రలను జీవితంలో నిజంగా వున్న వారిలా చేయడానికి ప్రయత్నించుతాడు. ఇది చేయాలంటే అతడు వారిహృదయ కవాటాలకు తాళం చెవులు సంపాదించాలి

# 10

ఒక నవలను రాయడంలో, పాత్రలను సృష్టించడంలో వివిధ రచయితలు వివిధ మార్గాలను అవలంభించుతారు. కొందరి రచనవిధానం, తనను ప్రేరేపించిన విషయాన్ని పోల్చిచూసుకోడానికి కంపాస్‌లూ, రూళ్ళకర్రలు వుపయోగించే భవనశిల్పిని జ్ఞప్తికి తెస్తుంటి. మరికొందరు రచయితలు మట్టి ముద్దను మానవ ముఖాకృతిలోకి క్రమంగామార్చే శిల్పుల లాంటివారు. ఒక నవల మొదటి అధ్యాయం ప్రారంభించే ముందు వివరంగా పథకం వేసుకొనే రచయితలున్నారు. మరికొందరు రాస్తూ పోతూవుండగా కథను నడిపించే వారున్నారు.

తన నవలలో కథాగమనం తర్వాతి అధ్యాయంలో ఎలా పెంపొందుతుందో చెప్పలేనని అలెగ్జీటాల్ స్టాయ్ నాతో ఒకసారి చెప్పాడు. తాను రాసే నవలలోని ఆ

అధ్యాయం పూర్తి అయిన తర్వాతనే తనకావిషయం బోధపడుతుందని అన్నాడు. రచయిత ఒకవేళ చాలా వివరంగా పథకం సిద్ధం చేసుకొన్నా, రాస్తూపోతూ ఉన్నప్పుడు దానిలో మార్పులు చేయడం తథ్యం.

గతకాలంలోని మహారచయితల నవలల చిత్తుప్రతులు ఇదే విషయాన్ని తెలియజేస్తున్నాయి. నేను వారి రచనలగురించి మాటాడిన అనేకమంది ఆధునిక రచయితలు కూడా ఇదేవిషయాన్ని తెలియజేశారు. మార్పులురావడానికి కారణం ఇది. రచయిత తాను వ్రాయదలచుకొన్న నవలలోని కథానాయకుని తాను ఎన్నాళ్ళనుండో మనస్సులో సృష్టించుకొంటూ వచ్చినప్పటికీ, అతడింకా సజీవవ్యక్తి కాదు. ఇంకా అతడు నీడ మాత్రమే; అందుచేతనే మార్పులు వస్తాయి. ఆ నీడకు రక్త మాంసాలు కల్పించవలసివస్తుంది. అలాకల్పించి ఆ పాత్రను సజీవంగా రచయిత చేసేటప్పటికి, ఆ కథానాయకుని చర్యలను తాను సరిగ్గా ముందుగా చూడలేకపోయినట్లు రచయిత గ్రహించుతాడు. తాను ఊహించిన పథకంలో కథానాయకునికి ఆపాదించినట్లుగా అతడు ఆలోచించ లేదనీ, భావించలేదనీ, పనిచేయలేదనీ రచయిత గ్రహించుతాడు.

అందుచేతనే తన నవలల్లో కథాగమనం ఎలా వృద్ధి చెందుతుందో తాను గ్రహించలేని అలెగ్జీటాల్‌స్టాయ్ చెబుతున్నాడు. మొట్టమొదట రచయిత తన ప్రధానపాత్రతో బాగా పరిచయం ఏర్పరచుకోవాలి.

రచయిత వేసుకొన్న పథకానికి (ప్లాట్) కథారచనలోని పాత్రలు లొంగవు. అవి అటూ యిటూ మారుతూ రచయిత ప్లాన్లను ప్రతిఘటించుతాయి. నేనిది వరలో చెప్పిన చెకొవ్ కథ "ది ఫియాసా" (Fiahcee) వుంది. ఇది ఒక ఉదాహరణ. ఇలాంటివే ఎన్నో వున్నాయి. అసహజమైన విషయాలను చేయవలసిందని పాత్రలకు రచయిత ఆజ్ఞాపించాడనుకోండి. తప్పకుండా అతడు విఫలం అవుతాడు. వెంటనే రచయిత అలాంటి పుస్తకం కళావిహీనంగా ఉన్నదని గ్రహిస్తాడు.

రచయితకు తన పాత్రలు సజీవమైన ప్రజలుగాని, ఎటుపడితే అట్టుత్రిప్పే చదరంగం పావులుకావు. (చదరంగంలో సైతం ప్రతిపావుకూ ఒక గమనంవుందన్న విషయం జ్ఞాపకం వుంచుకోవాలి). కొంతవరకు పుస్తకం లోని పాత్రలు, మనోభీష్టానికి సంబంధం లేనివనీ చెప్పవచ్చు. రచయిత వాటి స్వభావాలను అర్థం చేసుకోవాలేగాని అవి సరిగా ఎలాప్రవర్తించాలో దానిని గురించి వాటికి ఆదేశించలేడు. పాత్రలు చేసే తప్పులకు కొందరు విమర్శకులు రచయితనే నిందించుతారు. చిత్తశుద్ధిగల, ధైర్యవంతులైన ఉదాత్తులైన ప్రజలను గురించి, సజీవ ప్రజలను గురించి రచయిత రాస్తున్నప్పుడు, రచయిత వారి

బలహీనతలను కప్పిపుచ్చలేదు. వారి పొరపాట్లను, అపజయాలను దాచలేదు. ఏంచేతనంటే రచయిత చిత్రించదలచినది ప్రజల్నిగాని, అట్టబొమ్మల్ని కాదు.

రచయితలు వట్టి అమాయకులనీ, తమ పాత్రలు తప్పు చేస్తున్నాయని గ్రహించక తమకంతా తెలిసినట్లు నటించే రాజకీయ అజ్ఞానులని విమర్శకులు నిజంగా భావించుతున్నారా? ప్రజలూ, సమాజమూ, జీవితమూ ఒకవ్యక్తి యొక్క దోషాలను చూపించుతారు. ప్రజలు ఎలా కాలుజారుతారో చూపించి సరిదిద్దుతారు. అలాగే సరియైనమార్గాన్ని పాఠకునికి చూపించుటలో రచయిత తోడ్పడతాడు. ఒక పుస్తకంలో గ్యాలీలను ప్రూఫ్‌రీడర్ దిద్దినట్లు రచయిత తన పాత్రల జీవితాన్ని సందిద్ద లేదు.

ఒక గ్రంథంలోని పాత్రలు సజీవప్రజలు కాబట్టి రచయిత వాటిని ప్రేమిస్తాడు. వాటితోపాటు నవ్వుతాడు, ఏడుస్తాడు. వాటితోపాటు బాధలను వంచుకుంటాడు. పియరీ గోరియట్ మరణాన్ని వర్ణించుతున్నప్పుడు బాల్జాక్ జబ్బుపడి డాక్టరును పిలిపించదలచాడన్న వార్త నిజమో, కాదో నాకు తెలియదు. ఇది కట్టుకథ అయినా, కాక పోయినా, తన పాత్రలపట్లబాల్జాక్ వైఖరిని ఇది తెలియ జేస్తుంది. తాను ప్రేమించినపాత్ర మరణాన్ని వర్ణించేటప్పుడు రచయిత దుఃఖాను భూతిని పొందకుండా దానినెలా వర్ణించ కలడు? రచయితలకు వాస్తవిక మరణం సంభవించే ముందు, అతడు అనేక సార్లు మరణయాతనలను అనుభవించవలసి యుంటుందనే దాకా నేను పోతాను. బాల్జాక్ చాలా వైవిద్యం కలవాడు. ఇతర రచయితలు తమ సన్నిహితులకు చెప్పక దాచివుంచే అనేక విషయాలను కూడా బాల్జాక్ వర్ణించాడు.

ఒక నవలను పూర్తిచేశాక, చాలాకాలంగా తాను కష్టపడి చేసినపని పూర్తి అయిందికదా అని సంతోషాన్నీ, ఉపశమనాన్నీ పొందుతాడు. ఆ తర్వాత గాఢమైన విచారం క్రమ్ముకు వస్తుంది. ఎంతో సన్నిహితంగా ఎరిగియున్న ఆత్మీయులనుండి దూరంచేయబడినట్లు అతడు బాధపడతాడు. వెనుకటి గ్రంథాలలోని పాత్రలు గత కాలంలోకి అదృశ్యమైపోయినా, రచయిత పూర్తిగా వాటితో సంబంధాన్ని తెగతెంచుకోడు. అదృశ్య సమూహంలాగా అవి అతనిని చుట్టు ముట్టుతాయి.

బిడ్డను కనడం అంటే ఏమిటో ప్రతి తల్లికి తెలుసు. దానిని లియోటాల్‌స్టాయ్ కూడా అర్థం చేసుకొన్నాడు అద్భుతంగా దానిని వర్ణించాడు కూడా. కాని దానిని మన విమర్శకులంతా అర్థంచేసుకున్నారా అనేది నాకు తెలియదు.

# 11

సుదీర్ఘమైన నవల రాసిన రచయిత కూడా తన పాత్రల యావ జ్జీవితాన్ని చిత్రించలేడు. మరీ చాలా ముఖ్యమైనవి అనుకొనేవాటినే అతడు ఎన్నుకుంటాడు. ఆపాత్ర జీవితంలోని ఒక రోజు జీవితాన్ని అతివివరంగా ఒక్కొక్కసారి అతడు చిత్రించుతాడు. ఆ తర్వాత రెండేళ్ళ జీవితాన్ని గురించి ఒక్క ముక్క కూడా చెప్పడు. నవలలోని ఒక పాత్ర నివసించే గృహం గురించి వివరంగా అతడు వర్ణించవచ్చు. కాని ఆ పాత్ర భార్య ఎలా వర్ణించవలసిన అవసరంలేదని అతడు భావించ వచ్చు. రెండోరకం పాత్ర మూర్తిని అతడు చిత్రించవచ్చు. ఆకురాలు కాలంలోని ఉదయం లేక వసంత కాల సాయంత్రం గురించి రచయిత వర్ణించి పైన చెప్పిన ఆ ఉదయాన్నో లేక సాయంత్రమో! పని చేయడానికో లేక నిర్ణీత స్థలంలో కల్సుకుందామని ముందుగా చెప్పుకొని అక్కడికి వెళ్లే ఆ వ్యక్తి వయస్సును రచయిత వర్ణించక పోవచ్చు.

చాలామంది రచయితలు తమ నవలలను సినిమా తీయడానికిగాని, నాటకంగా మార్చడానికిగాని, చివరకు బొమ్మలు చేర్చడానికిగాని ఇష్టపడరు. స్టేజి డైరక్టర్, లేక నటకుడు చిత్రకారుడు ఊహించిన చిత్రాలకు విభిన్నమైన చిత్రాలు రచయితల మనస్సులో వుంటాయి. పాఠకునికి చెప్పిన దానికంటె కూడా రచయితకు తన పాత్రలను గురించి ఎక్కువ తెలుసు. వ్యక్తిస్వభావాన్ని, అతని నడవడినీ విశదపరచేటటు వంటి ఘటనలను, జీవిత వివరాలను, ఆలోచనలను భావనలను రచయిత ఎన్నుకొంటాడు. పాఠకుడు పుస్తకం చదవడం ముగించగానే తనకు ఆ కథలోనిపాత్రలతో పరిచయం అయినట్లు వాటి జీవితాన్ని తెలుసుకొన్నట్లు, వారిహృదయాలను తెలుసుకొనట్లు భావించాలి. చెకోవ్ "డార్లింగ్" అనే కథ చాలా చిన్నది. కాని ఆ కథచదివిన ప్రతివాడూ, ఆ కథా నాయికను, ఆమెకు దగ్గరగా ఏండ్ల కొలదీ నివసించిన వానిలాగా, ఊహించుకోగలడు.

సోవియట్ సాహిత్యం చాలా పాత్రలను సృష్టించింది. వాటిని గురించి పాఠకులకు బాగా తెలుసు. ఆ పాత్రలను వారు ప్రేమిస్తారు కూడా. రోష్చిన్, లెవిన్సన్, గ్రిగరీమెలెఖోవ్, దేవిదోవ్, కిరిల్ ఇస్వెకోవ్, సైనికుడు ఇగ్నాపీవ. ఇలా ఎన్నో పాత్రలను ఉదహరించవచ్చు. ఒక మనుష్యుని వాస్తవికంగా చిత్రించడానికి సాధనంగా ఒక పద్యం అంతగా ఉపయోగకారి కానట్లు కనపడ వచ్చు. కాని వాసిలి ట్యోర్కిన్ అనే పాత్రతో మనకందరికి బాగా పరిచయం వుంది. అతనిని ఎన్నోసార్లు కలుసుకొన్నట్లు అనిపించుతుంది.

లెనిన్‌గ్రాడ్ ఇంజనీర్‌ను అంతగా బాధించిన, విఫలమైన నవలలు, చాలా పేజీలను ఒకోసారి చాలా చాలా పేజీలను కల్గియుండవచ్చు. కాని పాఠకునికి ఆ పాత్రల అంతరంగిక ప్రపంచం గురించి దాదాపు బొత్తిగా తెలియదు. అలాంటి పాత్రలున్నవనే అతడు నమ్మడు.

రచయితలో నైపుణ్యం లేకపోవడంవల్ల యిది సంభవించలేదు. పాత్రలను అబద్ధంగా చిత్రించడం వలన, సరిగా చిత్రించ లేకపోవడంవల్లనే ఇలా జరుగుతోందని నా అభిప్రాయం.

సోషలిస్టు సమాజం నిర్మించకముందు అసాధ్యమైనటువంటి నూతన కృత్యాలను, ఆలోచనలకు, భావోద్రేకాలనూ, (Emotions) మన ప్రజల మంచి స్వరూపాలను చూపించడానికి సోవియట్ రచయిత ప్రయత్నించడం పూర్తిగా సహజమే. ఈ పనుల్ని సజీవప్రజలు చేస్తున్నారు. ఈ ఆలోచనలు ఉద్రేకాలు, ఇతర ఆలోచనలు పాటే ప్రక్క ప్రక్కన వుంటున్నాయి. అవి కొన్ని రసహీనంగాను, మరికొన్ని పాతకాలపు భావాల నుండి తలెత్తినవి గాను ఉంటున్నాయి. మన సమకాలినులు భవిష్యత్ యుగాల ఆదర్శ మానవులకు ఉదాహరణలు కారు. అనేక కష్ట పరిస్థితులలో వారు ఇదివరకెన్నడూ సాధించని పనులను సాధిస్తున్నారు. కాని ప్రతివానికి కొన్ని లోపాలు బలహీనతలున్నాయి. ప్రతివాడు తన స్వంత మార్గాన జీవించుతున్నాడు. అతడు ప్రేమిస్తాడు, అసూయపడతాడు, ఆశతో నిండివుంటాడు, లేదా నిరాశతో క్రుంగిపోతాడు, సంతోషించుతాడు లేక దుఃఖిస్తాడు. పాత్రనుఒక భాగం మాత్రం చూపించుట ద్వారా, ఆ పాత్రను"నీచ పరుచు" తుందని అనుకొనే భాగాన్నంతటినీ వదలి వేయడం ద్వారా అతని ఉత్సాహాన్ని, శ్రామిక విజయాలను మాత్రం వర్ణించుట ద్వారా, ఆ పాత్రను రచయిత అవాస్తవికం చేస్తున్నాడు.

ఒక్కొక్కప్పుడు ఏమైనాసరే పాఠకుని తన అభిప్రాయాలతో ప్రభావితుణ్ణి చేయాలనే కోర్కెతో, రచయిత చేసే రచనలలో పుట్టే పాత్రలు (స్కీమెటిక్) స్వభావం కలిగివుంటాయి. నవల, వార్తాపత్రికలోని వ్యాసం కాదన్న విషయాన్ని అతడు మరచిపోతాడు. ఎంతో బాగా వున్నదనుకొన్న పోస్టర్, కళా చిత్రం (పెయింటింగ్) కాజాలదని అతడు మరచిపోతాడు. ఒకోసారి వాస్తవిక జీవితాన్ని కొద్దిగా మాత్రం చూపించుతే, రసహీనంగా వుంటుందని భయపడి, తన కల్పిత ఆదర్శకథానాయకునికి అన్ని సద్గుణాలనూ రచయిత అంటగడతాడు. ఒకొక్కప్పుడు తానుచిత్రించుతున్న వ్యక్తిని గురించి పూర్తిగా తెలియదు అర్థంచేసుకోనూ లేడు. అలాంటప్పుడు ఆ వ్యక్తి చేస్తున్న వృత్తిలోని విజయాలను రచయిత వర్ణించుతాడు. ఎందుచేతనంటే మానవ హృదయం పనిచేసే విధానాలను అర్థంచేసుకోడం కంటే తన రచనలోని

కథానాయకుడు పనిచేసే యంత్రం పనిచేసే విధానాలను అర్థం చేసుకోడం ఆ రచయితకు సులభం.

బూర్జువా ఫ్రాన్స్‌కు చెందిన ఆధుని కనవలలను చదువుతుంటే, ఒక కోణం ద్వారానే పాత్రలను ప్రదర్శించుట ద్వారా రచయితలు వాటిని యెలా నాశనం చేస్తున్నదీ మనకి స్పష్టమవుతుంది. చమత్కారమైన మనస్తత్వాన్ని చిత్రించడంకోసం, ప్రేమను ఇతి వృత్తంగా తీసుకుని రచించిన ఒక నవలను ఉదాహరణకు తీసుకోండి. ఈ నవలలో నాయకుడు నాయిక, మరొకరు మామూలుగా వుంటారు. మూడవ వ్యక్తిని మొదటిసారి చూసినప్పుడు కథానాయికకు కల్గిన భావాలను వివరంగా రచయిత వర్ణించుతాడు. దానివల్ల నాయకుడు పడే బాధలను కూడా వర్ణించుతాడు. కథానాయిక మూడో వ్యక్తితో వెళ్ళిపోతుంది. మళ్ళా కథానాయకుని వద్దకు తిరిగివస్తుంది. మళ్ళా ఆ మూడో వ్యక్తిని చూడాలని కోరుతుంది. మూడో వ్యక్తికి, యాదృచ్ఛికంగా కథానాయకునితో పరిచయం యేర్పడుతుంది. రచయిత వారిద్దరి మనోభావాలనూ వర్ణించుతాడు. చివరి అధ్యాయాలలో కథానాయికకు ఒకకల వస్తుంది. ఆ కలను గురించి కథానాయకునికి చెప్పనా, వద్దా అని రోజుల్లా ఆమె ఆలోచించుతుంది. కథానాయిక చేతిమేజోడు తన మేజాబల్లలో వుండటం మూడో వ్యక్తి యాదృచ్ఛికంగా గమనించుతాడు. ఇతడు ఉద్రేకపడుతాడు, పశ్చాత్తాపం చెందుతాడు అంతేకాదు కొంచెం ఆనందాన్ని పొందుతాడు. అదే సమయంలో అనిర్వచనీయమైన విసుగూచెందుతాడు. ఇవన్నీ ఒకేసారి అతని మనస్సులో రేగుతాయి. అంతటితో సరి. చేతిమేజోడు విషయం వచ్చేసరికి పాఠకునికి విసుగెత్తుతుంది. ఆవేశం కొద్దీ పుస్తకాన్ని విసిరిపారవేస్తాడు. అలా విసిరివేయడం ఆ పుస్తకం ప్రేమ సంబంధ గ్రంథమైనందువల్ల కాదు. ప్రేమ స్పర్ధలు కల ఇతివృత్తాలు పాతబడిపోలేదు. అసూయను మనం అర్థం చేసుకోలేని ఉద్రేకం అని అనడానికి వీల్లేదు. పై మూడు పాత్రల భావాలను వివరంగా పరిశీలించడమూ కొత్తకాదు. కాని ఇలాంటి మానసిక వ్యాయామాన్ని ఫ్రెంచి వాళ్ళు 'వెంట్రుకను నాల్గు భాగాలుగా చీల్చడం' అనే మానసిక వ్యాయామం అంటారు. పోతే ఇక్కడ పైన చెప్పిన రచయిత చేస్తున్న దేమిటంటే, అసలు కోడిగ్రుడ్డు లేకపోయినా, దాని ఈకల్ని పీకడం. అందుచేత ఇలాంటి కథానాయకుణ్ణి, నాయకురాల్ని మూడవ వ్యక్తిని పాఠకుడు అసలునమ్మడు. రచయిత ఈ ముగ్గురి పరిసర వాతావరణాన్ని చెప్పలేదు. మూడవ వ్యక్తి నివసించిన భవనాన్ని గురించి. మేజాబల్లలోని చేతిమేజోళ్ళను గురించి వివరంగా వర్ణించాడు. కాని అతని వృత్తి ఏమిటో, చేతిమేజోడును గురించి అతడు ఆలోచించని సమయంలో అతడు ఏం చేస్తుంటాడో మొదలైనవి ఏవీ తెలుసుకోడం అవసరమని రచయిత

భావించలేదు. అతడు ఫాషన్‌బుల్ డాక్టరా? స్టాక్ బ్రోకరా? పార్లమెంటు సభ్యుడా? రచయిత చెప్పే విధానం చూస్తే అతడు జర్నలిస్టుగా కనబడతాడు. కాని మనకు అతడు ఎక్కడ పనిచేసేదీ ఏమిరాసేది మొదలైనవేవీ తెలియ జేయలేదు. ఒక ముసలావిడను అతని మేనల్లుడు చంపితే, ఆ శవాన్ని గురించి రాస్తున్నాడో, అమెరికా ఉదారతను గురించి రాస్తున్నాడో ఏమీ తెలియదు. కథానాయిక ప్రవర్తనకు ఆమె తల్లిదండ్రుల వైఖరి ఏమిటి? రచయిత తెలియ జేసిన ప్రకారం ఆమె తల్లిదండ్రులు కర్పూరపు ఉండల్నీ, తాళం కప్పల్నీ, నీతినియమాల్నీ పూజిస్తారు. అలాంటి తల్లిందండ్రుల పట్ల ఆ కథానాయిక ధోరణి ఏమిటి? సమాజం నుండి ప్రత్యేకంగా ఏరి తీసుకువచ్చిన పాత్రలే గాక, వాటి జీవితాల్నుండి కూడా సంబంధం లేకుండా ఏరి తెచ్చిన పాత్రలు, ప్రత్యేకంగా ప్రేమ కలాపాల్లోనే మునిగి వుండే పాత్రలు, అవాస్తవికంగా కన్పిస్తాయి. పైన చెప్పిన మూడు పాత్రలూ మైనపు బొమ్మలు. వాటిని గురించి పాఠకుడు ఏమీ బాధపడడు. అతను కేవలం విసుగెత్తిపోతాడు.

జయప్రదం కాని సోవియటు నవలలో-నేనిదివరకే ప్రస్తావించిన నవలలో - (అయితే ఈనవల అసలు ప్రచురించబడలేదు) రచయిత, వెంటనే నాయికానాయకుల వృత్తిని బయట పెడతాడు. (సహజంగానే యిందులో మూడోవ్యక్తి లేడు) కథానాయికా, నాయకులిద్దరూ ఒక ఉక్కు పరిశ్రమాగారం ఫౌండ్రిలో పని చేస్తారు. కథానాయిక మంచి సాహసంగల వ్యక్తి. నూతన విధానాలను కనిపెట్టే తత్వానికి ప్రతిబింబం. కథానాయకుడు చిత్తశుద్ధిగలవాడే కాని, మార్పులకు ఇష్టపడని బాపతువాడు. 100కి ఆరుపాళ్ళ ఖర్చును తగ్గించే కొత్తఉత్పత్తి విధానాన్ని కథానాయిక ఆలోచించుతుంది. కథానాయకునికిఅందులో విశ్వాసంలేదు. ఉత్పత్తి విషయం చర్చించే సమావేశాన్ని రచయిత వివరంగా వర్ణించుతాడు. కథానాయిక చొరవను ఒక ముసలి ఫోర్మన్ ప్రశంసించుతాడు. నిరాశావాదియైన ఇంజనీర్ మాత్రం, ఈ కొత్త పద్ధతి సరియైనదేనా అని సందే హించుతాడు. రాజధానీ నగరంనుండి ఒక ఉపసంఘం వస్తుంది. ప్రాంతీయ కమిటీ ఒక సమావేశం జరుపుతుంది. చివరకు కథానాయిక కొత్తపద్ధతిని అంగీకరించడంతో ఆమెకు పూర్తి విజయం-ఇవన్నీ రచయిత వివరంగా వర్ణించు తాడు. ఈ ఘటనలతో పరవశుడైన కథానాయకుడు, కథానాయికను అభినందించుతాడు. కథానాయిక సిగ్గు పడుతూ ఇలా అన్నట్లు రచయిత తెలియజేస్తాడు:

"గ్రిషా! మనం ఇంకా కొంత కష్టాన్ని మన భుజస్కంధాలపై వేసుకు మోయాలి".తర్వాత అధ్యాయంలో వీరిద్దరూ తమవంతు పనిని పూర్తి చేయడమే

గాక ఇంకా ఎక్కువపనికూడా చేస్తారనీ, రెండో విషయం వీరికో కొడుకు పుడతాడనీ మనకు తెలుస్తుంది.

ఈ కథానాయికా నాయకులిద్దరూ మొదట ప్రేమించుకొంటారు. కథా నాయిక సూచించిన ఉత్పత్తి విధానంపై విభేదాలు సమసిపోగానే, వారిద్దరూ పెళ్ళి చేసుకొంటారు.

కార్మికసమస్యలకు సంబంధించిన ఇతివృత్తాన్ని (థీమ్) తీసుకోడం చాలా బాధ్యతాయుతమైనపని. పైగా కొత్త ఇతివృత్తం కూడా పెట్టుబడిదారీ సమాజంలో కార్మికులను శాపంగా చూస్తారు. రోజూ పనిచేసే గంటలు తగ్గించాలని ఆశించే స్వాప్నికులుగా మాత్రమే వారిని చూస్తారు మనసమాజంలో శ్రమను హర్షించుతారు. సృజనాత్మక కార్యంగా ఎంచుతారు. పనిచేయడం తమ జీవితంలో ఒక నిరుత్సాహకరమైన విషయంగా చూసే పాత్రలతో మన జీవితాన్ని చిత్రించే నవలలను మనం ఊహించలేము. అందుచేత పైన నేను చెప్పిన నవలాకారుని తప్పులు ఉక్కు ఫౌండ్రీని, నూతన పద్ధతిని, నాయకీ నాయకుల అభిప్రాయ భేదాలను వర్ణించడంవల్ల కలగలేదు. అదంతా వర్ణించాల్సిందే కాని రచయిత తన పాత్రలను, వాటి వ్యక్తిగత జీవితాలనుంచి దూరంచేశాడు. కథానాయకునికి నాయిక పట్లగల ప్రేమను ఏదో యథాలాపంగా సూచిస్తాడు. ఒక అధ్యాయంలో నూతనంగా జన్మించినశిశువు ఏడుపును మనం హఠాత్తుగా గమనించుతాం. నిష్కపటంగా చెప్పాలంటే ఆ నవలలో మనల్ని కొద్దిగా విభ్రాంతుల్ని చేస్తుందీ శిశు ఆక్రందన. తన పాత్రలకు ఔన్నత్యం సమకూర్చుతున్నానని రచయిత భావించాడు కాని వాస్తవానికి అతడా పాత్రను కించపరిచాడు. ఆ పాత్రలలో గంభీరత, భావంలో క్లిష్టత లేకుండా చేశాడు. ఉద్వేగభావాన్ని సంపూర్ణంగా అభివృద్ధిచేయలేదుకూడా. అలాంటి నవలలు ప్రచురితమయ్యాయి. కొన్ని అనేక ముద్రణలుకూడా వెలువడినాయి. బొగ్గు, ఉక్కు, కాలికో మొదలైన విషయాలను చర్చించే వృత్సవ విగ్రహాల పాత్రలను నటకులు ధరించవలసివచ్చే నాటకాలుకూడా కొన్నివున్నాయి. అలాంటి నాటకాలను క్రిందిచూపు చూచేవారు ప్రేక్షకులు (ప్రేక్షకుల స్థానాలు రంగస్థలంకంటె క్రిందిగావున్నప్పటికీ). ఆరంగంలో ప్రదర్శించబడిన ప్రజలను ఆదిమవాస (ప్రిమిటివ్) ప్రజలుగా ఎంచేవారు.

సోవియట్ ప్రభుత్వం ఏర్పడిన 35 ఏండ్ల యీ కాలంలో మన అత్యుత్తమ రచయితలు, అనేక సజీవ పాత్రల పరంపరను సమాజంకోసం పోరాడినవారిని లేక ఆ సమాజాన్ని నిర్మించుటలో తోడ్పడినవారినీ సృష్టించారు. మన సమకాలికులను - వారి అంతరంగిక ప్రపంచం చుట్టూ ఒక గీతగీసి కుదించి చిత్రించిన అనేక నవలలు, చిన్న కథలూ ఎందువలన ఉంటున్నాయి?

ఈ తప్పుకు కొంతవరకు బాధ్యత కొందరు విమర్శకుల, సమీక్షాకారుల, సంపాదకుల (దురదృష్టవశాత్తు అనేకమంది) పైనవుంది. ఇప్పటిదాకా వారి అభిప్రాయం ఏమంటే, ఒకపాత్రను సరళంగా సృష్టించడం అంటే దానిని ఆకాశానికి ఎత్తడం, ఇతివృత్తాన్ని లోతుగాను, విశదంగాను వర్ణించడం అంటే, దాన్ని తక్కువ అంచనా గట్టడం.

మన పత్రికలు ప్రేమకవితను చాలా సంవత్సరాలుగా దాదాపు అచ్చువేయ లేదనే చెప్పవచ్చు. బాలబాలికలు పెరిగారు. వయస్కులయ్యారు ప్రేమించు కొన్నారు. బాధలుపడ్డారు. సుఖాన్ని పొందారు. కాని ఇది కవితలో ప్రతి బింబించ లేదు. పునర్నిర్మాణ సమయంలో, వీరోచితకృషి జరుగుతున్న సమయంలో మరో ఇతివృత్తాలకు తావులేదని మీరనవచ్చు "దానిని గురించి" ("About That") అనే కవితను మయకొవస్కీ రాసినప్పుడు అదేమంత సాధారణ సమయం కాదు. ప్రేమ ఇతివృత్తాన్ని కూడా ఉన్నత స్థాయికి కొనిపోవచ్చుననీ, భవిష్యత్‌ను గురించి కనే కలలలో జోడించవచ్చుననీ మయకొవస్కీ నిరూపించాడు. మన ప్రచురణాలయాలు, పత్రికలు గేయకవితను వదలి వేసిన కాలంలో మన రేడియో తరుచుగా పుష్కిన్, లెర్మాంటివ్‌ల ప్రేమకవిత్వంనుండి, ఎ. కె. టాల్‌స్టాయ్, ఫెట్, చివరకు రాట్‌గౌస్‌ల గేయా లను తీసుకొని ప్రసారం చేయడం గమనించవలసిన విషయం. రాట్‌గౌస్ గేయా లలోనేగాని ఆధునిక కవితలో తమ మనోభావాలను మన ప్రేమికులు ఎందుకు చూడగూడదు? ఇలా నేనింకా ప్రశ్నించుకుంటూ పోవచ్చు. మన చిన్న కథలలో ప్రేమికుల తగాదాలుగాని, కుటుంబ కలహంగాని, వ్యాధిగాని, బంధు మరణం గాని, చివరకు చెడ్డ వాతావరణంగాని అరుదుగా కన్పించుతాయేం? ("మంచి వేసవి రోజున", మే లో సుగంధ మారుతం వీచే సాయంత్రాన" "ఆకురాలు కాలంలో విసిల ప్రభాతాన" ఇలా సాధారణంగా మొదలౌతాయి వర్ణనలు.) భగ్న ప్రేమ ప్రేమించిన వ్యక్తులను కోల్పోవడం మొదలైన విషయాలను వర్ణించడం. వనికిరాదనీ, మన ప్రజల వీరోచితకృత్యాలను, తాత్వికంగా భవిష్యత్తులో మనకుండే ఆశావాదాన్ని వర్ణించడంతో పొసగని విషయంగా, ఇప్పటికి కొంతమంది విమర్శకులు అమాయకంగా భావిస్తున్నారు.

నూతన సమాజ ప్రజలను, నిజమైనప్రణలను, క్లిష్టమైన, సంపద వంతమైన పరిపూర్ణమైన జీవితం కొనసాగించే ప్రజలను, (అంతేగాని జీవరహిత [స్కీమెటిక్] వ్యక్తులనుగాదు) చిత్రించవలసిన కఠినమైనబాధ్యత మనపై బడింది. కఠినమైనదైనా ఈ బాధ్యత మహత్తరమైనది.

# 12

రచయిత శిల్పాన్ని గురించి చెప్పేటప్పుడు తరచుగా నేను గత కాలపు రచయితలను పేర్కొన్నాను. వారినుండి మనం నేర్చుకోవలసిందేమిటి? దీనికి సమాధానం సహజంగా సంపన్నత, అమలినభాష, వాక్యనిర్మాణం, సాహిత్య విధానాలు - అనే.

ప్రామాణిక రచయితలనుంచి యిదంతా నేర్చుకోవలసిందే. వార్తా పత్రికలలోని దరిద్రభాషతో నవలలను వ్రాయవలసిన పనిలేదు. టాల్‌స్టాయ్ వ్యక్తి చిత్రీకరణను, నవలలో నిమటనాక్రమంలో ప్రకృతిని ("లాండ్ స్కేప్") కళ్ళకు గట్టినట్లు చిత్రించగలిగిన తుర్గెనెవ్ శక్తినీ మితంగా మాట్లాడినా చక్కగా వ్యక్తం చేయగల సాధనాలు గల చెకోవ్ ప్రత్యేకతనూ అసలు విషయాలకు సంబంధించని వాటిని లయబద్ధంగా వర్ణించడంలో గొగోల్ ప్రతిభనూ లెర్మాన్ టోవ్ వచనంలో విపులమైన స్పష్టీకరణ, కవితల సమ్మేళాన్ని మనం జ్ఞాపకం తెచ్చుకోవాలి. ఇలాగే ఇంకా చెప్పవచ్చు.

మరొకరినుండి నేర్చుకోవడం అంటే, వారిని అనుసరించడం అనికాదు. నూతన కథావస్తువుకు నూతన రూపాలు అవసరమని నా భావన. 19వ శతాబ్దం లోని నవలలో, వ్యక్తుల, లేక కుటుంబాల చిత్రీకరణ మాత్రమే వుండేది. ఆ నవలలో రచయిత తన పాత్రలను ఒక కథానాయకుని లేక అనేక కథా నాయకుల చుట్టూ, గుమిగూర్చేవాడు. నేటి ప్రజాజీవితం ఎక్కువగా వ్యక్తి అంతరంగిక జీవితంలో ఒక భాగమే. కథానాయకుడు లేక కథానాయకులతో సంబంధంవుండే అనేకమందిని చిత్రించకుండా, నేడు ఒక నవలను - అది మనస్తత్వం చిత్రించే నవలైనాసరే - రాయడం అనూహ్యమైన విషయం. నవలా నిర్మాణంలో తప్పకుండా ఈ విషయం పనిచేస్తుంది. జీవిత పద్ధతికూడా మారింది. పెద్ద పెద్ద వర్ణనలతో నిరంతరం పాఠకుల్ని నిలబెట్టే ఘటనలను ఆధునిక నవలలో ఉండటం నేనూహించలేను, తుర్గెనెవ్‌కు అలా వర్ణించడం సహజమే. కాని నేడు అది సంప్రదాయబద్ధ శైలిగా కన్పడుతుంది.

ప్రామాణిక రచయితలనుండి మనం నేర్చుకోవలసిన విషయం వేరేవుంది. ప్రజలను చిత్రించడంలో ఆ రచయితలు అనుసరించిన పద్ధతులను మనం నేర్చుకోవాలి.

అది యిపుడు అసాధ్యం అనీ, ఇపుడు పరిస్థితి పూర్తిగా మారిపోయిందనీ మీరు అసమ్మతి తెలియజేయవచ్చు.

నిజమే, సోవియటు రచయిత 19వ శతాబ్దం నాటి రచయితవంటి వాడు కాదు. అతనిది నేడు వేరే మనస్తత్వం. అతడు వేరుగా అవగాహన

చేసుకొనేది చాలా వుంది. నేటి సోవియట్ రచయిత చిత్రించే ప్రజలు ప్రామాణిక సాహిత్యంలోని పాత్రలవంటి వారు కారు. రూడిన్, లెనిన్‌లలాగా నేటి రచనలోని పాత్రలు తర్కించవు. చెకోవ్ పాత్ర ట్రోఫిమోవ్ లాగా పనిచేయవు. చెకోవ్ రచనలోని కథానాయికలులాగా "ముగ్గురు సోదరీమణులు" ప్రేమించరు.

తమ పాత్రలను చిత్రించేటప్పుడు వాటి గురించి తాము చూచినది మాత్రమే వర్ణించి వూరుకొనే వారుకాదు 19వ శతాబ్దపు మహా రచయితలు కాలానికి వేసిన ముసుగును తొలగించి భవిష్యత్తులోకి చూచేవారు. అయితే వారికి సమాజాభివృద్ధికి చెందిన శాస్త్రీయ సిద్ధాంతం తెలియదు. కాని నేటి సుపరచయిత ఎవరికైనా ఆవిషయం అతని ఆస్తి. వారు ఎక్కువగా ఊహించవలసి వచ్చేది. అందుచేత తరచు తప్పులుకూడా చేసేవారు. వారి తాత్విక సిద్ధాంతాలు, సామాజిక అభిప్రాయాలు అమాయకంగా, పరిమితంగా, ఒక్కొక్కప్పుడు అబద్ధంగా మనకు కన్పించుతాయి. మానవ సంబంధాల అభివృద్ధి తీరుతెన్ను సోవియట్ రచయితలు నిర్వచించగలరు; అభ్యుదయకరమైన మనోభావాలేమిటో నాశనం గాక తప్పని భావాలేమిటో వారికి తెలుసు.

రచయితల శిల్పం గురించి మాట్లాడేటప్పుడు తరచుగా, నేను మన ప్రాచీన రచయితలను పేర్కొంటానికి కారణం. తమ సమకాలికులను వారు అసాధారణమైన నిశితదృష్టితో అవలోకించారు గనుకనే కళలోని వాస్తవికత, మానవుని గాఢంగా అర్థం చేసుకోవడం, సజీవ మానవ వ్యక్తిగా అతనిని చిత్రీకరించగల్గిన శక్తి, మొదలైన వాటిని వారినుండి మనం నేర్చుకోవాలి.

బూర్జువాసమాజంలో వాస్తవికతకు కళకు మధ్య ఆఘాతం వుంటుంది. బూర్జువా యువకుడు ఒకడు ఒక పేదఅమ్మాయిని పెళ్ళి చేసుకోవాలని తలచాడనుకోండి. లేదా వర్తకానికి బదులుగా కళాసృష్టిలో నిమగ్నమయ్యాడనుకోండి. లేదా లాభసాటి బేరం కాని గౌరవవృత్తిని ఏదైనా చేపట్టాడనుకోండి. వెంటనే అతని తండ్రి చిరాకుగా "జీవితం నవలేమీ కాదు" అని అంటాడు.

ఫ్లాబర్ట్ రాసిన "మదాంబొవారీ" అశ్లీలానికి అసమ్మతి తెల్పిన దెవరు? వ్యభిచార గృహాలకు వెళ్ళుతూ, ఉంపుడు కత్తెలను ఉంచుకోడం ఒక ఫాషన్ అని అనుకొనే అదే పెట్టుబడిదారులు. బొట్టిసెల్లీ చిత్రాలు యువకులను అవినీతి పాలు చేస్తున్నాయని, వాటిని తీసివేయవలసిందని ఈమధ్య ఇటలీలో కోరిందెవరు? బూతు ప్రచురణలకు చందాదార్లయిన ముసలి విషయలాలసులే. చాప్లిన్ ఫిల్ములను అవినీతికరమైనవని అమెరికాలో ఆక్రోశించేదెవరు? ఉన్న తాధికారాలతో వుండి, ఆ అధికారాలతో రక్షణ పొందుతున్న పెద్ద పెద్ద దొంగలూ, బందిపోటు దొంగలూ, తుచ్ఛమైన పనులద్వారా లక్షలాది ధనం సంపాదించేవాళ్ళే.

బూర్జువా వర్గానికి నీతి నియమాల విషయాలపై ద్వంద్వ ప్రమాణా లుంటాయి. మామూలుగాఉండే పది ధర్మాలుగాక (క్రైస్తవ మత ప్రకారం పది ముఖ్య ధర్మాలున్నాయి.-అను.) బూర్జువావర్గం పదుకొండో ధర్మం ఒకటి తెచ్చి పెట్టింది. అది: "ధనాన్ని గౌరవించండి" అని. వారికి సంబంధించి నంతవరకు ఈ పదకొండవ ధర్మాన్నిమాత్రమే తమకు అట్టిపెట్టు కొంటారు. అసభ్యనైతిక సూత్రాలకు వారు అతీతులు. వారు దొంగతనం చేయవచ్చు. అబద్ధం ఆడవచ్చు. నైతికంగా దిగజారిన జీవితం కొనసాగించవచ్చు. హత్య చేయవచ్చు.

తమ కొకటి ఇతరులకు మరొకటీ నైతిక ప్రమాణాలు ఉండాలనే ద్వంద్వ ప్రమాణ పద్ధతిని సోషలిస్టు సమాజం ఖండించుతూంది. మర్యాదగా బ్రతకాలని మాటాడుతూనే దొంగతనం చేసేవారు, ఆత్మవిమర్శ కావాలని చెబుతూనే చిన్న నియంతలాగే వర్తించేవారూ, సత్యాన్ని ప్రేమించుతామని చెబుతూనే అపవాదులు వేసేవారూ, మాకూ వున్నారు. అయితే ఇలాంటివారు చాలా తక్కువ; ఇలాంటివారిని ఎదుర్కొని మా సమాజం పోరాడుతోంది. మా ప్రజలలో ఏ ఒక్క భాగమూ మా దేశంలో ఏ గౌరవనీయుడూ, పైన చెప్పిన రెండు రకాల నైతిక ప్రమాణాన్ని కోరదు. ప్రజలను మోసంచేసే కళలో మా ప్రజలకు అభిరుచి లేదు.

జీవితం నవల లాంటిదనీ, నవల జీవితం లాంటిదనీ మా ప్రజలు భావించుతారు. తన పాత్రలను నిజమైన ప్రజలుగా చిత్రించనందుకు ఒక రచయితను సోవియట్ పాఠకులు తప్పుబట్టారంటే, అది కొంత ఆలోచించ వలసిన విషయమే.

నాకు వచ్చిన ఉత్తరాలలో లెనిన్‌గ్రాడ్ ఇంజనీర్ రాసిందే మొదటి ఉత్తరం కాదు. సాహిత్యంలో జీవితం గాఢంగా, వాస్తవికంగా ప్రతిబింబించాలని పాఠకులు తరచుగా నాకు జాబులు రాస్తూవుంటారు. (ఇతర రచయితలకుకూడా ఇలాంటి వుత్తరాలు వస్తాయని నాకు తెలుసు.) సాధారణ ప్రజలయొక్క-నిజానికి వారు సాధారణ ప్రజలుకాదు - మానవుని ఆత్మికాభివృద్ధికి సంబంధించిన కష్టాలను, అభివృద్ధికీ గతకాలపు అవసాన చిహ్నాల భారానికీ మధ్యగల వైరుధ్యాలనూ, సంపూర్ణంగా వాస్తవిక జీవితంలోవలె హృదయపూర్వకంగా చిత్రించాలని రచయితలను పాఠకలోకం కోరుతుంది. దైనందిన జీవితాన్ని, జీవిత శౌర్యాన్ని రచయితలు చిత్రించాలని పాఠకలోకం వాంఛిస్తూంది. మన ప్రజల ముఖ్యలక్షణం కాదని అసత్యావేశపరత లేకుండా మన శక సంరంభాన్ని చిత్రించాలని వారు కోరుతున్నారు. అతిశయోక్తులు లేకుండా సోవియట్ స్త్రీ, పురుషుల స్వభావాన్ని చూపించాలని పాఠకులు కోరుతున్నారు.

ఔన్నత్యం అంటే పోటీపెట్టి నిలబెట్టే ఊతకాలు కాదు. అలాగే చిత్తశుద్ధిస్థానే పటాటోపాన్నీ ఉంచి గందరగోళపడిలాభం లేదు. అందుచే కపట ఔన్నత్యాన్ని చిత్తశుద్ధిలేని పటాటోపాన్ని వర్ణించవలదని రచయితలను, మన పాఠకులు కోరుతున్నారు.

మన రచయితలంతా ఆదర్శవంతమైన ప్రజలనే చిత్రించాలని కొందరు విమర్శకులు అభిప్రాయపడుతున్నారు. ఆధునిక బూర్జువా నవలలోని పాత్రలు పైకి సంస్కారం కలిగినట్లు కన్పించుతాయి. కాని అంతర్ముఖంగా చూస్తే పశుస్వభావికులు, కొంతవరకు మిధ్యావాదులు, జూదవ్యాపారులు, మోసగాళ్ళు, హేమ్లెట్ పాత్రలాంటివాళ్ళు. ఇలాంటివారికన్నా నేటి సోవియట్ పౌరుడు ఎంతో ఉన్నతవ్యక్తి, ఉదాత్త ఆత్మగలవాడు, ఎంతో క్లిష్ట స్వభావం గలవాడు. మన జీవితాన్ని వాస్తవికరూపంలో చూపించినట్లయితే ఆ అద్భుతప్రజలను చిత్రించే పుస్తకాలు మనకు లభ్యమవుతాయి. సాధారణ సోవియట్‌పౌరుని తీసుకొండి. అతనిలో సుగుణాలూ ఉంటాయి. తప్పులూ వుంటాయి. గత కాలంలోని అభ్యుదయవాదులు తాము సాధించలేమని భావించిన ఆదర్శ సమాజాన్ని నేడు నిర్మించుతున్న దెవరు? నమూనా అనదగిన అందరికి ఆదర్శవంతులైన అసాధారణ ప్రజలు కాదు. మామూలు మానవమాత్రులే.

లెనిన్‌గ్రాడ్ ఇంజనీర్ పేర్కొన్న నవలలో పాత్రలలో తప్పులుండవు. ఆ పాత్రలన్నీ అందంగా మెరుగులు దిద్దితీర్చబడినవి. వాటిలో ప్రతిదానికీ తమ పోరన్ అంతా కంఠతావచ్చు. ఒకవేళ అపాత్ర మరచిపోయినా, రచయిత సరిగా ప్రాంప్టింగ్ (క్యూ నాటకంలోని సంభాషణలోవాక్యం అఖరి భాగం) ఇస్తాడు. అలాంటి పాత్రలు ఒక్క విషయంలో మినహా అంతా మంచివే. అదేమిటంటే, పాఠకుడు ఆ పాత్రలు వాస్తవంగా ఉన్నదని నమ్మడు.

ఇప్పుడు తరచుగా: "మాకు దుష్ట (నెగిటివ్) పాత్రలను ఈయండి" అనడం మామూలు అయింది. ఆదర్శమైన శిష్ట (పాజిటివ్) పాత్రలను కోరే విమర్శకులే, ఈ విషయం అంటుంటారు. బలహీనతలుగాని, తప్పులుగాని లేకుండా ఒక అద్భుతమైన వ్యక్తి చిత్రాన్ని ఒక రచయిత సమకూర్చుతాడను కోండి. అతనితో పాటు ఒక బద్ధకస్తునీ, దగాకోరునూ నిజమైన మానవ స్వభావాలతో కూడిన వ్యక్తినీ చిత్రించుతాడనుకోండి, అపుడు పరిపూర్ణమై రక్త మాంసాలతో నిండిన ఈ దుష్టపాత్రకు ఆధిక్యతరాదా? ఒక కోణంద్వారా మాత్రమే ప్రచురించబడి ముఖంమాత్రం కాంతివంతం చేయబడిన ఆదర్శ పాత్ర, తన నీడనుకూడా ప్రసారించక పై చెడ్డ పాత్రచే వెనక్కి నెట్టి వేయబడదా? ష్టోల్ట్జ్ పాత్రను మచ్చలేని దానినిగా చేయాలని గోంచరోవ్ తలిచాడు. కాని అది వాస్తవిక పాత్రలాగా లేదు. కాని అబ్లొమోవ్ పాత్ర

సజీవంగావుంది: ఒక పాతికేళ్ళక్రితం నేను రాసిన నవలలో నేనుకూడా విఫల మయ్యాను. దుష్టపాత్రలు చాలా వాస్తవికంగా వున్నాయి. శిష్టపాత్రలకు నేను అన్ని విధాలా సద్గుణాలనూ, సత్ స్వభావాలనూ అంటగట్టినా వాటికంటే దుష్టపాత్రలే, నిజమైనవిగా వాస్తవికమైనవిగా ఉన్నాయి. ఇతర ఆధునిక రచయితలు కూడా ఇలాంటి అపజయాలనే అనుభవించారు.

సోవియట్ రచయితలు మన సాహిత్యాన్ని గాఢంగా ప్రేమించుతారు. ఈ సాహిత్యంలోని లోపాలకు మనసారా విచారించుతారు. విజయాలకు సంతోషించుతారు. వారు మన సమాజంలో వివిధోన్ముఖమై సంపదవంతమైన జీవితాన్ని చూస్తున్నపుడు, మన నవలలు కొన్ని వాస్తవిక జీవితాన్ని చూపించ లేక పోతున్నాయనీ, అతిచులకన చేస్తున్నాయనీ, సాంప్రదాయ ధోరణిలో వుంటున్నాయనీ పాఠకులు గ్రహించుకున్నారు. తమ కామ్రేడ్స్‌ను, తమ సమకాలీనులను, తమను నవలలో చిత్రించాలని వారు కోరుతున్నారు. వారేమీ తమను ఆదర్శ పురుషుల నమూనాలుగా చిత్రించమని కోరడంలేదు. సజీవ ప్రజలుగా చిత్రించాలని కోరుతున్నారు.. టాల్‌స్టాయ్, చెకోవ్, గోర్కీల ప్రామాణిక గ్రంధాలను తిరిగి తిరిగి చదువుతూంటే విప్లవానికి పూర్వపు రష్యా లోని ప్రజలను ఎంత సూక్ష్మదృష్టితో, ఎంత చాకచాక్యంతో, ఎంతచైతన్యంతో చిత్రించారో మనకు బోధపడుతుంది. సాధారణ పాఠకులు-వారి అంతరంగిక ప్రపంచం ఎపుడూ సాధారణమైనది మాత్రం కాదు-సోవియట్ నవలలో తమకు స్థానం ఉండాలని నిత్యం కోరుతున్నారు.

# 13

రొమాంటిసిజంతో నిండిన మంచి పుస్తకాలున్నాయని నాకు తెలుసు. నిర్జీవమైన ఊతకాలుతో పోటిపెట్టి నిలబెట్టిన, నీతిమంతమైన పాత్రలతో నిండిన పుస్తకాలతో నేను వీటిని మేళవించి గందరగోళం చేయడంలేదు. ("రొమాంటిక్" అంటే గత శతాబ్దంలోని మొదటి అర్ధభాగంలో వచ్చిన సాహిత్య ఉద్యమం అని నా అభిప్రాయంకాదు. మామూలుగా అందరూ వాడిన అర్థంలో, అనగా భావోద్రేకాన్ని ఉన్నతస్థాయికి తీసుకుపోయిన అర్థంలో వాడుతున్నాను.")

దేహానికి భాస్వరం అవసరం అయినట్టుగానే మనస్సుకు రొమాన్స్ కావలసిన కాలంవుటుంది. పుష్కిన్ గాఢ అభిప్రాయాలను వారికి తెలియజెప్పే వరకు యువకులు లెర్మాంటివ్ రచనల ప్రవాహంలో కొట్టుకొనిపోవడంలో ఆశ్చర్యం ఏమిలేదు. "యంగ్ గార్డ్" అనే నవలలోని దళసభ్యునికి "డెమన్" అనేది అభిమాన పద్యం కావడంలో ఆశ్చర్యంలేదు. జోరీగ అనే దానిని అంత శ్రద్ధగా అనేక తరాలవారు చదువుతూ వుండటంకూడా ఏమంత ఆశ్చర్యకరమైన విషయంకాదు. అనేకమంది ఇతర ప్రసిద్ధ రచయితలు పుస్తకాలలోకన్నా

నికోలై ఆస్ట్రోవ్‌స్కీ నవలలో, మన దేశ యువకులకేగాక విదేశాల యువకులకు సైతం వారి యువజనాత్మ ప్రతిబింబం కన్పించింది.

రొమాంటిక్ నవలలపట్ల యువకులేగాదు ఆకర్షించబడేది. పదాడంబరం, అసహజ పరిస్థితులు, అతిశయోక్తుల పుట్టలతో నిండిన హ్యూగోను ఎన్నడో రసపిపాసులు పాతిపెట్టారు. కాని గత సంవత్సరం హ్యూగో వర్ధంతి జరిగి నప్పుడు హ్యూగో రచనలు యింకా బాగా వ్యాప్తిలో వున్నాయనీ, అతని రచనలను ప్రతిచోటా చదువుతున్నారనీ తెలియవచ్చింది. పాత రష్యన్ సాహిత్యం తీసుకొంటే, 'తారాస్‌బుల్బా', 'దిపోర్ట్రయిట్' 'ఆస్యా' మొదలైన వున్నాయి. అలాగే గోర్కీ మొదట్లో వ్రాసిన కథలున్నాయి. ఒక ఈనాడు చూస్తే, కావెరిన్ పాస్టావ్‌స్కీ, కజకెవిచ్ మొదలైనవారి పుస్తకాలను అన్ని తరాల పాఠకులు ఆనందంగా చదువుతున్నారు. "యంగ్ గార్డు" చదువుతూ వయోవృద్ధులైన వారు కూడా దుఃఖించిన వారిని నే నెరుగుదును.

మానవ స్వభావంలోని ఉత్తమ భాగం కేంద్రీకరించబడిన పాత్రలను ప్రదర్శించడం, రొమాంటిక్ ఇతివృత్తాన్ని చిత్రించే రచయితకు సాధ్యపడు తుంది. తాను ఎన్నుకొన్న పాత్ర స్వభావాలపై రచయిత దీపకాంతి ప్రసరింప చేస్తాడు. దీనివల్ల పాత్రలలోని లక్షణాల నిష్పత్తి బాగా మారుతుంది. రొమాంటిక్ నవలలోని పాత్రలు నిజమైనవేనని మనం నమ్మడానికి కారణం అవి నీతి బోధకై ఉద్దేశింపబడిన వాటివలెగాక కవితాత్మతో నిండియుండడమే. ఈ రచయిత నీతిబోధలు సాగించాడు. పాత్రను ఉన్నత స్థాయికి కొనిపోతాడు. దూరాన్నీ, ఔన్నత్యాన్నీ బయటపెడతాడు.

ఫ్రెంచిస్కూలు పిల్లలకి ప్రతియేటా పరీక్షలలో ఈ క్రింది ప్రశ్నల లాంటివి వస్తూవుంటాయి. "ప్రజల్ని ఉన్నదున్నట్లుగా చిత్రించిన రాసైన్‌ను, ప్రజలు ఎలావుండాలో చిత్రించిన కార్నిల్లీతో పోల్చి చెప్పండి." ఒక కుర్రాడు ఇలా సమాధానం రాశాడు. "కార్నిల్లీ కంటె రాసైనే మనకు దగ్గరవాడు. గాఢ మనోభావాలు కల ప్రజల్ని అతడు యధాతథంగా చిత్రించాడు." మరొక కుర్రాడు ఇలా రాశాడు: "కార్నిల్లీ నిస్సందేహంగా రాసైన్ కంటె గొప్పవాడు. నీతి మంతులుగా ధైర్యవంతులుగా ఉన్నత మనోభావాలతో ఉత్తేజం పొందిన వారిగా పతనావస్థకు దారితీసే బలహీనతలన్నీ జయించిన వారిగా ప్రజలను, ప్రజలు ఎలా వుండాలో అలాంటి ప్రజలను, చిత్రించిన కార్నిల్లీయే నిస్సం దేహంగా గొప్పవాడు.

వాస్తవికతావాదుల, యధాతధవాదుల (నాచురలిస్ట్‌ల) అధివాస్తవికుల, నూతన వాస్తవిక వాదులకు ముందే రొమాంటిక్ కవుల తీవ్ర ప్రకటనలు వెలువడకముందే, పాత్ర చిత్రీకరణ పద్ధతిలో విభేదాలు వుండేవి.

కళలో స్వప్నాలు, వాస్తవికత గురించి పాశ్చాత్య దేశాలలో నేడూ వాద వివాదాలు కొనసాగుతున్నాయి. అలాంటి వాదనలు మన ప్రజల్ని గాని, మన పాఠకలోకాన్ని గాని కదల్చడంలేదు, సోషలిస్టు వాస్తవికతావాదం ఒక సాహిత్య ధోరణి కాదు. అనేక విభిన్న సాహిత్యా పద్ధతులను అది అనుమతించు తుంది. ఆంటనోవ్ చిన్న కథ ''వర్షం'' అంటే నా కిష్టం. చిత్తశుద్ధితోను, కరుణార్ద్ర స్వభావంతో నిండివున్న ఆ కథకు చెకోవ్ సైతం తలయూపి వుంచేవాడు.

కజకెవిచ్ వ్రాసిన రొమాంటిక్ నవల "నక్షత్రం'' (స్టార్)ను నేను హర్షించడానికి ఇదేమీ అడ్డురాలేదు. ''ఇద్దరు కెప్టెన్లు'', "పంటసిరి'' (హార్వెస్టు) మొదలైన నవలలలోని పాత్రలు విభిన్న పద్ధతులో చిత్రించబడినాయి. ''దళం'' (దిసెైంటీన్)లో, ఫెడయెవ్ పాత్రలను సాధ్యమైనంత సత్యంగానూ, వినయం గానూ చిత్రించాడు. "ది యంగ్ గార్డ్" లో పాత్రలను రొమాంటిసిజం అనే కాంతితో వెలిగించాడు. ''పై రెండు గ్రంథాలూ విజయం పొందినవే.

రేసిన్, గాథ వాంఛపట్లిన, నైతికంగా పతనమయిన ఫెడ్రీని చిత్రించాడు కార్నెల్లీ సృష్టించిన పాత్ర హొరేస్. పాతకాలపు కఠినమైన వ్యక్తి ఈ పాత్ర. హొరేస్‌కు భిన్నమైన ప్రపంచంలో ఫెడ్రీ నివసించుతూంది. 19వ శతాబ్దంలోని రొమాంటిసిస్టులు తమ పాఠకులను పర్వత శిఖరాలకు కొనిపోయే వారు. యధాతధవాదులు (నాచురలిస్టులు) ఎక్కడో భూమి లోపలి జీవితంలో పాఠకులను కూర్చోబెట్టదలిచే వారు. ''లా మిజరబులే'' లో జావెర్ట్ లాంటి ఉదాత్త స్వభావుడైన పోలీసూ, ఫ్లాబర్ట్ రాసిన డాక్టరు బొవారీ లాంటి దయార్ద్రహృదయ వ్యక్తులూ ఒకే ప్రపంచంలో ఉండజాలరు. అయితే ఈ రెండు నవలలూ కూడా దాదాపు ఒకే కాలంలో రాయబడినాయి. వాస్తవంగాలేని మనిషిని హ్యూగో చూశాడు. నిజంగా చూడవలసినదంతా తన పాత్రలో చూడడానికి ఫ్లాబర్ట్‌కు ఇష్టం లేదు.

"స్టాలిన్‌గ్రాడ్ యుద్ధ కందకాలలో'', ''నక్షత్రం'' అన్న నవలలు రెండూ రెండు భిన్నమైన రకాలు. వీటి రెండింటికీ గల విభేదం ఏమిటి? ఇతి వృత్తంలో కాదు. స్టాలిన్‌గ్రాడ్ యుద్ధంలో కూడా శత్రుశ్రేణుల వెనుక వేగుల వాళ్ళ శౌర్యం వలెనే చిత్రించవలసిన విషయమే.

"నక్షత్రం" లోని కథానాయకుడు. నెక్రసావ్ నవలలోని సొరంగాలు తవ్వేవారు మానసికంగా గాని, భావాలలో గాని విభేదంకల పాత్రలు కాదు. వారు ఒకే యుద్ధకందకంలో కూర్చుని వుండరు. నేను ఊహించగలను. వారు ఒకరినొకరు అర్థం చేసుకోగలరు. జీవితంలో ఒకే ప్రయోజనం కల వ్యక్తులు కూడా. అయితే రచయితలు వారిని విభిన్న మార్గాలలో సృష్టించారు. అంత

మాత్రాన రెండు ప్రపంచాలుగా వీరు విభజింపబడలేదు. కళ యొక్క బహుళ రూపం మాత్రమే అది.

పాత్ర చిత్రీకరణలో రొమాంటిక్ ధోరణిని కొందరు విమర్శకులు ఖండించిన విషయం నాకు గుర్తు వుంది. కాని నేడు తద్విరుద్ధంగా, ఆదర్శ ప్రజలను రచయితలు చిత్రించాలని ఆ విమర్శకులు కోరుతున్నారు. దోష రహిత పాత్రలు మాత్రమే పాఠకునికి ఆదర్శవంతంగా వుంటాయని వారి వాదన నిజంగా అది అంతేనా? సాహితీ రచనలను వివిధ పాఠకులు వివిధ రకాలుగా అర్థం చేసు కొంటారు. పాఠకుని యొక్క వయస్సును బట్టీ, మానసిక నిర్మాణాన్ని బట్టీ అది వుంటుంది. కొందరు నవలలోని ఆదర్శ పాత్రలను అనుకరించడానికి ప్రయత్నించుతారు. మరికొందరికి అలాంటి పాత్రలు ఏదో దూరంగా ఉండేవనీ, అందుబాటులో ఉండేవీ కావనీ అనుకొంటారు. తప్పులులేని పాత్రలను గాదు వారు ఉదాహరణగా తీసుకునేది. తప్పు చేసినా వారి తప్పుల నుండి, విజయాల నుండి గుణపాఠాలు నేర్చుకొంటారు. వీరులు ఎలా పుట్టారో వారు తెలుసుకోదలచడం లేదు. వీరులెలా అవాలనేదే వారు తెలుసుకో దలుస్తున్నారు.

ఫ్రెంచి స్కూలు పిల్లలకు, పండిత ప్రకాండులయిన ప్రాచీన విమర్శకు లకు ప్రజలను చిత్రించాలనే వాదవివాదాలను వదలివేద్దాం. సజీవ ప్రజలను చిత్రించాలని మనకు తెలుసు. అలా చేయాలంటే, సత్య సంధత, ఉద్వేగం, మానవత (Human warmth) ఉండాలి. ఈ గుణాలు వాస్తవికతావాదికి, రొమాంటిసిస్టుకు కూడా కావలసిందే. ఒక సాహిత్య పద్ధతి నుండి మరో పద్ధతిని విడదీసే గుణాలుకావు అవి. కాని చెత్తాఖానీ సాహిత్యంనుండి, కిరాయి సాహిత్యం నుండి వేరుచేసే గుణాలవి.

## 14

మన విమర్శకు లొకరు ఇలా రాశారు;

"వాస్తవికతతో, మానవస్వభావంలోని అపరిపక్వతల వక్రతలకూగల కారణాల్ని నాశనంజేసిన సోషలిజంతోను ఆదర్శం ఏకకాలంలో సంభవించిన పక్షంలో, సోవియట్ సాహిత్యంలోని శిష్టపాత్రలు తలయెత్తుతాయి." ఈ విమర్శకుని వాదనే సరియైనదయితే, 1948 లోని వాస్తవికత (ఈ వాస్యం రాసింది ఆ సంవత్సరంలోనే) ఆదర్శప్రాయమైనదయితే, సమగ్రమైనదైతే, సోషలిజంనుండి కమ్యూనిజానికి క్రమంగా పరివర్తన చెందాలని మనం చెప్పడం అర్థం కాని విషయం. కొందరు విమర్శకులు రచయితలకు దుబారాగా రాజకీయ పాఠాలు నేర్పాలని సంసిద్ధమయ్యేవారే మార్క్సిజం యొక్క ప్రధాన సూత్రాలను సమగ్రంగా అర్థం చేసుకోలేదనీ, జీర్ణించుకొనలేకపోయారనీ నా భయం.

"మానవ స్వభావంలో అపరిపక్వతలకూ, వికృతరూపాలకూ గల కారణాలు" అన్ని సోషలిస్టు సమాజంలో నశింపజేయబడినాయని మనం అనగలమా? సోషలిస్టు సమాజం పరివర్తనాదశలోని సమాజం. దానికి వెనుక పెట్టుబడిదారీ విధానంవుంది. ముందు కమ్యూనిజం వుంది. అక్టోబరు విప్లవం నూతన శకాన్ని ప్రారంభించింది. ఈ శకంలో ధనపూజ పద్ధతిస్థానే సృజనాత్మక శ్రమవిధానం వచ్చింది. ఇంతకుపూర్వం దురాశ, డబ్బుకు కాపీనం, స్వార్థపరత్వం మొదలైన అనేక దుర్గుణాలుండేవి. వాటిని అనుమతించడమేగాక ఒక్కొక్కసారి వాటిని గౌరవించేవాళ్ళుకూడా. నేడు వాటిని సోవియట్ ప్రజలు గర్హిస్తారు. ఆత్మను తినేసే ఈ దుర్గుణాలు ఇపుడు చాలా తక్కువే. అయినా పూర్తిగా అవి అదృశ్యమై పోలేదు. ఆత్మను చంపే రాచపుండ్లు మరికొన్ని వున్నాయి. ఒక నెలరోజుల వార్తా పత్రికలఫైళ్ళను తిరగ వేయండి. డాంబికం, అనిశ్చయం ఇచ్చకాలాడటం జడత్వం, బుద్ధిహీనమైన మొండితనం మొదలైన "లోపాలూ, వక్రతలూ" గురించి విమర్శించేవ్యాసాలు వార్తలు కనబడతాయి.

ఇంకా కొన్ని లొసుగులు మన సమాజంలో వున్నా, రచయిత వాటిని పేర్కొనవసరంలేదని చాలమంది విమర్శకులు, ప్రచురణాలయ సమీక్షకులు, పత్రిక సంపాదకులు భావించుతున్నారు. క్లిష్టపరచే ఉత్తమ సోవియట్ ప్రజల జీవితాలను న్యూనతపరచే, క్లిష్టపరచే, భావసంఘర్షణలను చిత్రించవలసివచ్చినపుడు అలాంటి విమర్శకులూ, సంపాదకులూ మరింత కఠినంగా ఉండాలని అంటారు.

సమాజంలో రచయిత పాత్రఏమిటి? అతని విధి ఏమిటి ప్రజలకు అతడు ఎలా సేవచేయాలి? అనే ప్రశ్న యిక్కడ తలెత్తుతోంది.

19వ శతాబ్దంలోని మహా రచయితలు తాము సృష్టించిన పాత్రల బాధలు, వారి హృదయాలలో గాఢంగా నాటుకొన్నాయి. హ్యూగో, డికెన్స్, బాల్జాక్, స్టెంథాల్, ఫ్లాబర్ట్లు స్వార్థంతోను, అసత్యాలతోను నిండివున్న ప్రపంచాన్ని బట్టబయలు చేశారు. అంతకంటె ఎక్కువ గాఢమైన మానవతతో గత శతాబ్దపు రష్యన్ రచయితలు రాశారు. బలవంతులు బలహీనులను, ధనికుడు బీదలను, పరాన్నభుక్కులు కష్టజీవులను, ఎలా పీడించారో చిత్రించారు. తమ పుస్తకాలలోని పాత్రలలాంటివారిని నాశనంచేసి చంపిన సామాజిక విధానాన్ని అంతమొందించే పోరాటంలో గత కాలంలోని పెద్దపెద్ద నవలా రచయితలు ప్రత్యక్షంగా పాల్గొనలేదు. అందులో కొందరు బాల్జాక్, గొగోల్లాంటి వారు తమ రాతలలో ఎవరినైతే బట్టబయలు చేశారో, వాస్తవ జీవితంలో అలాంటి వారినే వైరుధ్యాన్ని ప్రకటించారు.

మన ప్రజలు ఏ సమాజాన్ని నిర్మించడానికి కృషిచేస్తున్నారో ఆ కమ్యూనిస్టు సమాజం నిర్మించే కృషిలో ప్రతి సోవియట్ రచయితా పాల్గొంటాడు. అందుకు తమ శక్తిని ధారపోస్తాడు. పుస్తకాలు ప్రజలను మార్చుతాయనీ, జీవితాన్ని మార్చుతాయనీ మనకు తెలుసు. అందుచే రచయితలు ప్రజాకార్యకలాపాల్లోనేగాక, తమ సాహిత్యంలో కూడా యిందుకు కృషిచేస్తారు.

సాహిత్యం ప్రజలను జ్ఞానవంతులుగా చేస్తుంది. వారు ఇతఃపూర్వంకన్నా బాగా జీవించడానికి తోడ్పడుతుంది. వారి భావోద్రేకాలను ఉన్నత పథానికి కొని పోతుంది. తమ బంధువుల, స్నేహితుల ఇతర ప్రజలందరిని గురించి ఎక్కువగా ఆలోచించేటట్లు చేస్తుంది. నవలలు, కథలు, కవిత, సమాజాన్ని బంధించే భావోద్రేక బంధనాలు.

మన పనిలో మరో విషయంకూడావుంది. రచయిత, ఆంతరంగిక ఘర్షణలను, వైరుధ్యాలను చిత్రించాలి. తారుమారైన భావోద్వేగ లక్షణాలను అతడు గమనించాలి, మానవ హృదయంలో మంచి చెడ్డల మధ్య జరుగుతున్న ఘర్షణపై కాంతిని ప్రసరింపచేయాలి.

వ్యవసాయంచేసే పద్ధతి బాగా లేకపోతే, వ్యవసాయ శాస్త్రజ్ఞుడు బాగాలేదని చెబుతాడు. ఏదైనా ఉత్పత్తి కేంద్రంలో ఫలితాలు సంతృప్తికరంగా లేవని ఇంజనీర్ గమనించితే, ఆతడా విషయాన్ని మరుగుపరచడు. బహిరంగమయిన తగాదాలను, అవి సమసిపోవడానికి కుదిరిన పరిష్కార మార్గాలను మాత్రమే చిత్రించడం రచయిత విధికాదు. పుస్తకాల్లోగాని, వార్తా పత్రికల్లోగాని చర్చించని భావోద్రేక కల్లోలాలను కూడా అతడు చూపించాలి. మానవుని ఆంతరంగిక ప్రపంచాన్ని పాఠకులకంటె మరింత స్పష్టంగాను, పూర్తిగాను రచయిత చూడకల్గితే, అవి అందరకూ ఇంకా తెలియని పరిస్థితిలో ఆ విషయాలను తెలియ జేయకుండా ఎలా ఉండగల్గుతాడు? రచయిత స్థానం సరుకులతో నిండిన రైలుపెట్టెకాదు. ఏదో ప్రధాన కార్యాలయంలోని గుమస్తావలెగాక అతడు మార్గాన్వేషి (స్కౌట్). అతడు అనుకరించడు. వివరించుతాడు. కాని చూచేందుకు వీలుగా బహిర్గతం చేస్తాడు.

ఒకరెంకో రాసిన పుస్తకాలను చూసిన తర్వాత మన స్కూళ్ళలో చాలా మార్పులు చేయబడినాయి. "టిళ్ళదున్నేరు" అనే పుస్తకం, గ్రామాలు నూతన మార్గాలకు పరివర్తనం చెందేటట్లు చేసింది. "యుద్ధరంగం" (The front) అనేది మన సైన్యానికి చాలా సహాయపడింది.

మన పాఠకుల వ్యక్తిగత జీవితంలో అనేకమైన వైరుధ్యాలు లేవా? మనం పోరాడవలసివున్న గతకాలపు చిహ్నాలు మన ప్రజలలో ఇంకా మిగిలి

లేవా? ప్రజాకార్యకలాపాలలో విరివిగా పాల్గొనే వ్యక్తిని తీసుకోండి. అతని బహిరంగ జీవితానికి, క్రమబద్ధం కాని అతని ఆంతరంగిక జీవితానికి మధ్య వైరుధ్యాలు అరుదేనా? ఇలాంటి ఇతివృత్తాలు చాలా తమను ఉపయోగించుకొనేవా రెవరా అని రచయితలకోసం ఎదురుచూస్తున్నాయి.

తమ కథానాయకుల పతనాన్ని చిత్రించినపుడు 19వ శతాబ్దపు రొమాంటిసిస్టులకు మరో మార్గంలేదు. మానవ జీవిత నాటకానికి గల సామాజిక కారణాలను వారిలో చాలామంది అర్థంచేసుకొన్నారు. కాని అలాటి సమాజాన్ని మార్చడం సాధ్యమనే విషయాన్ని వారు నమ్మలేదు. ఒక్కొకసారి తమ నిస్సహాయతను మతరీత్యానో, తాత్వికంగానో సమర్థించడానికి ప్రయత్నించారు. "అనా కెరినినా" గ్రంథంలో ప్రారంభనీతివాక్యం కఠినంగా వుంది. "నేను పగ తీర్చుకొంటాను. దెబ్బకు దెబ్బ తీస్తాను" అనేది ఆ నీతి వాక్యం. "థెరెసే రెక్విన్" అనేదానికి టైన్ రాసిన ఈ క్రింది నీతివాక్యం జోలా తీసుకొన్నాడు. "రసాయనిక పరిణామంవల్ల పంచదార, మైలతుత్తం ఎలా ఉద్భవించుతాయో, అలాగే సామాజిక జీవిత ఫలితంగా సుగుణాలూ, దుర్గుణాలూ తప్పనిసరియైనవి"

సోవియట్ రచయితకు దుర్గుణాలు పుట్టుమచ్చల లాంటివిగావు. బాధపడటం అనేది ఒక కర్మ అన్నట్లుగా తప్పని సరియైన విషయం కాదు. సజీవమైన, హేతువాదతత్వంతో కూడిన సమాజంలో మనం నివసించుతున్నాం. అన్ని యుగాలలోను రచయిత స్వప్నం మానవుని కాపాడటం. మన స్వప్నం నేడు నిజమైనది. ప్రజలచే అధికారానికై ఎన్నుకోబడిన, ప్రజలను గౌరవించే వ్యక్తులచే మనదేశం పరిపాలింపబడుతూంది. చరిత్ర ఇలాంటి అవకాశాలను ఎన్నడూ రచయితలకు ఇవ్వలేదు. ప్రజలు మనకు అప్పజెప్పిన కర్తవ్యాన్ని నెరవేర్చటంలో మనం మనవిధిని పూర్తి చేయాలి.

# 15

రచయిత శిల్పం గురించి ఈ వ్యాఖ్యలను ఎంతో జంకుతో ప్రచురించడానికి నేను నిశ్చయించాను. ఇందులో చాలా విషయాలు వివాదగ్రస్తమైవని నాకు తెలుసు. నా వ్యక్తిగత అనుభవాలను పాఠకులతో పంచుకొనేందుకు ఇది రాశానని మొదట్లోనే తెలియజేశాను. ఇతర రచయితలు మరికొన్ని విషయాలను ఇంకా ప్రముఖమైన విషయాలనే చెప్పవచ్చు. ఈ వ్యాఖ్యలపై రచయిత ముద్ర వున్నందువలన నేను జంకడం లేదు. నవలలో రచయితలు ముందుగా ఏర్పరచుకున్న అభిప్రాయాలు, అనిష్టాలుకూడా ఇమిడివుంటాయి. రచనను గురించి ఇలాంటి సమస్యలను లేవనెత్తవలసిన సమయం వచ్చిందా అని సందేహపడ్డాను. అలాంటి సమయం వచ్చిందనే నా అభిప్రాయం.

యుద్ధానంతరం పశ్చిమయూరప్, అమెరికాలోని అనేక దేశాలలో నేను పర్యటించాను. ఆ సందర్భంలో విభిన్న రచయితలను కలుసుకున్నాను. సాహిత్యానికి ఇది సమయం కాదు" అన్న నిరాశాపూరిత వచనాలు ప్రతి చోటా విన్నాను. మరుసటి రోజున ఏమవుతుందోనని ఈ సాయంకాలం భయపడుతున్న ప్రజల గాఢాందోళనను గురించి రచయితలు తెలియజేశారు. మరో యుద్ధం గురించిన వార్తలు, పెద్దపెట్టున సామాజిక కల్లోలాలు, రోజు రోజూ దుర్భరమౌతున్న జీవన పరిస్థితులు,-ఇవన్నీ ప్రజలు పుస్తకాల గురించి ఆలోచించకుండా నిరోధించుతున్నాయి. కనీసం పుస్తకాల్ని తాకటానికి కూడా బుద్ధిపుట్టకుండా అవరోధం కల్గించుతున్నాయి. పాశ్చాత్య దేశాలలోని వివిధ రచయితలు, ప్రతీదీ పతనం ఐందని నాకు చెప్పారు. రచనాస్థాయి, ముద్రణా సంఖ్య, సాహిత్యంలో ప్రజల అభిరుచీ అన్నీ తగ్గిపోయాయని వారు చెప్పారు. "సైనికునికీ, రాజకీయవేత్తకూ దౌత్య రాయబారోద్యోగికీ అంతా సులభమే. వాళ్ళు చేయవలసిన పనేమిటో వాళ్ళకు తెలుసు. కాని రచయిత ఎవ్వరికీ అక్కర్లేదు. ఇప్పుడు సాహిత్యానికి సమయం కాదు." అంటూ మరీమరీ వారు చెప్పారు.

మనదేశంలో ఉన్నత సాహిత్యానికి సమయం వచ్చిందని నా కనిపించు తోంది.

"మన రచయితలకు రచనావ్యాసంగానికి అద్భుతమైన సౌకర్యాలు న్నాయి గదా! వారు చక్కని పుస్తకాలు రాయలేదా? మన దేశంలో నవలలు లక్షలాది ప్రతులు అమ్ముడుబోవటం లేదా? డజన్లు కాదు, వందలకొలది నవలలు ఇతర భాషలలోకి అనువదించబడలేదా?" అని పాఠకుడు ఆశ్చర్యంగా ప్రశ్నించవచ్చు.

ఇదంతా నిజమే. సోవియట్ రచయిత పరిస్థితులకు, పాశ్చాత్య దేశాలతో ఒకోసారి ప్రమాదభరిత జీవితాన్ని నడిపే చిత్తశుద్ధిగల రచయిత పరిస్థితులకు పోలికలేదు. మన నవలల ఎడిషన్ పరిమాణం బూర్జువాదేశంలోని నవలల ఎడిషన్ పరిమాణంతో పోల్చడానికే వీలులేదు. మనదేశంలో ఎవరు ఎక్కడ వున్నా, మన సాహిత్యంపట్ల ప్రజలు చూపే అభిరుచికీ, ఫ్రాన్స్ ఇంగ్లాండులలో ఆధునిక సాహిత్యంపట్ల చూపే అభిరుచికీ పోలికలేదు.

అయితే, మనదేశంలో గొప్ప సాహిత్యానికి సమయం ఆసన్నమయిందని నేను ఎందుకు చెబుతున్నాను?

మన ఉత్తమ రచయితలు అద్భుతమైన గ్రంథాలు రాసినమాట నిజమే. వాటిని ఆధునిక బూర్జువా నవలతో పోల్చిచూస్తే, కళాకారుని ఏ సమాజం ఉత్సాహపరుస్తున్నదో, ఏది అతనిని క్రుంగదీసి వేస్తున్నదో స్పష్టమౌతుంది.

గొప్ప రచయిత లెప్పుడూ శూన్యంలోంచి ఊడిపడరు. చిత్తశుద్ధిగల సగటు రచయితలెపుడూ వుంటారు. మన దేశంలో కూడా వున్నారు. పాశ్చాత్య దేశాలలోని సుప్రసిద్ధ ఆధునిక గ్రంథాలకన్నా ప్రశంసార్హమైనవీరి పుస్తకాలను, మరణశయ్యపైనున్న పాశ్చాత్య ప్రపంచ వేదనతో ఎందుకు పోల్చుకోవాలి?

మన రాజ్య జీవితంలోని అన్ని దశలలోనూ, మన సాహిత్య వికాసాన్ని గురించి విమర్శకులు ప్రసంగించారు. కాని ఒక భవాన్ని నిర్మించుతున్నపుడు ఇంటి కప్పు నుండి గాక, పునాది నుండి ప్రారంభించుతారు. ఆర్థిక విషయాల నుండి ఉదాహరణ తీసుకోవాలంటే చిన్న పరిశ్రమలను పెంపొందించడం సాధ్యమవడానికి ముందు భారీ పరిశ్రమలను స్థాపించాము. జీవితావసర వస్తువులు పుష్కలంగా లభించడం అనే సమస్య పుట్టకముందెన్నడో కుజ్నెట్స్క్, మాగ్నిటో గార్సెక్ ఇనుము ఉక్కు మిల్లుల పునాది గోతులు త్రవ్వబడ్డాయి.

గత 35 ఏండ్లలో సోవియట్ సాహిత్యం చాలా సాధించింది. మన సమాజ సారాంశం ఏమిటో ప్రజలు అర్థంచేసుకోడానికి అది సహాయపడింది. మన ప్రజలు చేసిన అద్భుతమైన పనులు, సాధించిన విస్మయకర విజయాలు, ఘటనలూ మనం వర్ణించాం. ఫాసిస్టులు మన దేశంపై దాడిచేసినపుడు వారు కార్యరంగంలో, రణక్షేత్రంలో ఎలా నిలబడ్డారో చూపించాము. మన సాహిత్యం నిర్మాణానికై కృషిచేసింది; శత్రువుతో పోరాడింది.

సోవియట్ రచయితల గ్రంథాలు ప్రపంచ భాష లన్నింటిలోకి దాదాపు అనువదింపబడ్డాయి. మరో నూతన ప్రపంచం ఆవిర్భవించిందన్న శుభ వార్తను ఈ గ్రంథాలన్నీ అన్ని దేశాలకు అందించాయి. కళాప్రతిభలో వివిధ అంతస్తులలో వున్న ఈ గ్రంథాలు మన సమాజంలో మంచి లక్షణాలను చూపించాయి. మనదేశ చరిత్ర కల్లోలపూరితం. ఈచరిత్ర ప్రతిదశా, సోవియట్ నవలల ద్వారా మన స్నేహితుల మనస్సులలో నాటుకొనివుంది. ప్రారంభంలోని పారిశ్రామికీకరణ దశను "సిమెంట్", సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను "బీళ్ళు దున్నేరు" (Virgin Soil Upturned), యుద్ధ కాలదశను "వొలోకొలా మస్క్ హైవే", రాత్రింబవళ్ళు (Days and Nights) "ప్రజ లజేయులు," (The People are immortal) అనే నవలలు చిత్రించాయి. యుద్ధ బీభత్సం నుండి పునర్నిర్మాణ దశను చూపించే "సౌఖ్యం (Happiness) "పంటసిరి (Harvest) మొదలైన నవలలు చిత్రించాయి. (ఇది పూర్తి జాబితాకాదని వేరే చెప్పనక్కర్లేదు. మన గ్రంథాలు నిర్వహించిన పాత్రను నొక్కిచెప్పడమే నా ఉద్దేశ్యం).

మన సమాజం ఇప్పుడే కొత్తగా, ప్రారంభమైనది గనుక, 19వ శతాబ్దపు రచయితలకన్నా మనకు సమకాలీన ఇతివృత్తాలను రాయడం చాలా కష్టమని నేనిదివరకే చెప్పాను. యుద్ధం మనకు అగ్నిపరీక్ష. ప్రజలీ యుద్ధం నుండి నైతికంగా బలపడి కాకలుతీరి బయటపడ్డారు. నేడు శత్రువులు కత్తులు దూసిఝుళిపిస్తున్నా మన ప్రజలకు తమ శక్తి సామర్థ్యాలు తెలుసుగనుక ప్రశాంతతను నిలబెట్టుకొని వున్నారు. అప్పుడప్పుడు విదేశాల నుండి వచ్చే వార్తలను చదువుతున్న సోవియట్ తల్లి ముఖంలో విచార రేఖ కన్పడుతుంది. సోవియట్ స్త్రీ గతయుద్ధంలో ఎన్నో బాధలకు లోనైంది. కాని ఇపుడామెకు గట్టిగా తెలుసు - మన ప్రజ లజేయులని, విచార ధోరణిని పోగొట్టుకొని, తన నూత్న శిశువు వంక దరహాసంతో నేడు ఆమె చూస్తోంది. ఇంత బలంగా మన సమాజం మున్నెన్నడూ లేదు. మన సమాజంలోని మానవుని రూపురేఖలు మరింత స్పష్టంగా వున్నాయి; మరింత భావద్యోతకంగా వున్నాయి. నూతన భవనం సుఖమయంగా వుంది. కొత్త ప్రజలు విస్పష్టంగా కన్పించుతున్నారు. నా తరం రచయితలు సాహిత్య కృషికి కష్ట దశలో పనిచేయగలిగివచ్చేది. నేటి సోవియట్ సమాజాన్ని ప్రజలను సంపూర్ణంగా ప్రతిబింబించే వాస్తవిక చిత్రాన్ని సమర్పించడం నేడు రచయితలకు సులభసాధ్యం.

మానవత్వానికి న్యాయానికి శత్రువు లయినవారు సోవియట్ రాజ్యాన్ని, అది పుట్టిననాటినుండీ ద్వేషించుతున్నారు. సోవియట్ రాజ్యం బలపడితే ప్రపంచ కార్మిక ప్రజలకు ఆదర్శవంతమైన రాజ్యమౌతుందని ఆ విధంగా ప్రమాదకర మని వారు భయపడసాగారు. సోషలిస్టు సమాజాభివృద్ధి ధోరణిని చూచికూడ వారు భయపడ్డారు. మన భవిష్యత్తును గురించిగాక, ప్రస్తుతాన్ని జూచే నేడు వారు భయపడుతున్నారు. మన జీవితం ఎలా మారిపోయిందో వారు గమనించు చున్నారు. వాదనలకన్నా, నినాదాలకన్నా, మన దేశస్థితినిగురించి వాస్తవం తెలిపే అంకెలను జూచి వారు భయపడుతున్నారు.

సోవియట్ సాహిత్యానికి పరిపక్వతాకాలం వస్తున్నది. ఇంతవరకూ ఆ సాహిత్యంలో చిత్రించిన వీరోచిత కార్యాలవల్ల ముఖ్యంగా ఆ సాహిత్యం బలంగా వుంది. ఈ కార్యాలను సాధించిన ప్రజలను చిత్రించుటద్వారా మన సాహిత్యం ఇక ముందు బలపడాలి.

మన దేశంలోని పాఠకులలాంటివాళ్ళు చరిత్రలో ఇతవరకు లేరు. పాఠకుల సభకు హాజరయినా, ఫ్యాక్టరీ లైబ్రరీలో ఒక సాయంత్రం గడిపినా, రచయితకు వచ్చే ఉత్తరాలను చూసినా, పాఠకుల ఉత్సాహమూ, ఆదరణా, గాఢతా తెలుస్తుంది. ఆ పాఠకులెవరు? పండిత, ప్రకాండుల ముఠాలూగాదు, లేక విప్లవానికి పూర్వకాలంలోని కొద్దిమంది మేధావులతో గూడిన ముఠాలూ

కాదు. మన పాఠకులు ప్రజలు మన రచనలను పాశ్చాత్య దేశాలలోని అంతఃపుర రాణివాసపు కవుల సాహిత్యంతోగాని, డిటెక్టివ్ నవలలతోగాని పోల్చరాదు. మన పాఠకులతో పోల్చాలి అపుడు, "సాహిత్యంలో ప్రతిబింబించిన దానికన్నా ఈ ప్రజలు చాలా గొప్పవారు" అని ప్రతివారూ చెబుతారు.

నేను భవిష్యత్తును ఆశతో చూస్తున్నాను. లెనిన్‌గ్రాడ్ ఇంజనీరూ లక్షలాది పాఠకులూ అద్భుత గ్రంథాలకోసం ఎదురుచూడవచ్చు. ఈ పుస్తకాలు ఆర్డరిచ్చినమాత్రానగాని, పథకాలు వేసుకున్నంతమాత్రానగాని రావు. మన సమాజ ఉన్నత పరిస్థితీ, దాని బలమూ, దానినైతిక శక్తీ, మన ప్రజలెంత మహోన్నతవ్యక్తులో అంత గొప్ప సాహిత్యమూ రానున్నదని చెబుతున్నాయి.

రచయితా : శిల్పమూ —ఇల్యా ఎహ్రెన్‌బర్గ్ —రు. 6/-

## మా వద్ద లభించు భాషా సాహిత్య గ్రంథాలు

| | | |
|---|---|---|
| కృష్ణశాస్త్రి కవితాత్మ | సోమసుందర్ | 11-00 |
| Lectures on Linguistics | E. M. Berezin | 6-00 |
| Dravidian Languages | Dr. M. S. Andronov | 9-00 |
| శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు విమర్శనం | గిడుగు రామమూర్తి పంతులు | 6-00 |
| తెలుగు పత్రికల సాహిత్య సేవ | డా. తిరుమల రామచంద్ర | 5-00 |
| సాహిత్యావలోకనం | సోదుం రామ్మోహన్ | 8-00 |
| చంద్రం వ్యాసావళి | మద్దుకూరి చంద్రశేఖరరావు | 5-00 |
| నవరల జీవనసరళి | టి. వెంకట్రావ్ | 5-00 |
| సాహిత్య వ్యాసాలు | మాక్సిమ్ గోర్కీ | 8-75 |
| విద్యా శిక్షణలు, వ్యాసాల ప్రసంగాలు సంకలనం | ఎ. లునచార్‌స్కీ | 10-25 |
| సాహిత్య వ్యాసాలు | ప్రేమ్‌చంద్ | 7-00 |
| సాహిత్య తత్వం | ఆర్వీయార్ | 13-00 |

ప్రతులకు :

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**

విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్,

హైదరాబాదు-500 001.

**విశాలాంధ్ర బుక్ హౌస్**

విజయవాడ, హైదరాబాద్, విశాఖపట్నం, గుంటూరు,

తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాద

ISBN : 81-7098-133-6

Cover Printed at General Printers & Publishers, Hyd.-1.

